# సంపాదకీయం

## మన వారసత్వం సమైక్యతకు నిలయమా ?

హిందూ ఏకాత్మతా యజ్ఞం నిర్వహిస్తున్న ప్రబుద్ధులు సమైక్యతకు మన వారసత్వం పట్టుగొమ్మ అని అంటున్నారు నిజమేనా ?

హిందూ వారసత్వం అంటే ఏమిటో చూద్దాం.

మనం హిందువులమా ? ధర్మగంగ బిందువులమా ? "ప్రాసకోసం పడిందిరా కూసుముండ" అన్నట్టు లేదూ ! లేకపోతే, మనం అనేదానికి అర్థం ఏమిటి ? వారసత్వం అంటే ఏమిటి ? సమైక్యత అంటే ఏమిటి ? ఇవన్నీ ఆలోచిస్తే నిరర్థకాలు- అర్థరహితాలు.

ఈ దేశంలో నిచ్చెన మెట్ల సమాజం వుంది. షుమారు నాలుగువేల కులాలుగా చీలిన భారతీయ ప్రజాకోటి ముక్కలు చెక్కలై అనైక్యతకు ఆలవాలమై దోపిడీకి గురై సతమౌతుంటే- సమైక్యత అనే పడికట్టు పదానికి ఏ అర్థం చెపుతారు ?

## ఏది మన వారసత్వం ?

జీవమున్న సోదరుని ఛీ-ఛాలతో ఛీత్కరించి, మానవుడి కంటె నీచమైన కుక్కలను గౌరిదేవి అని సంభావించటమా ? సాటి మనిషిని అల్లంత దూరాన చూచి ఎంతో దూరంగా తొలగిపోయే సోదరత్వమా ? నీటి కుండల్లో_ మడిబట్టల్లో పవిత్రతను పాటించటమా ? ఒకే తప్పు చేసిన నల్గురికి నాల్గురకాల శిక్షాస్మృతిని అమలు చేయటమా ? గో బ్రాహ్మణులకు స్వస్తి కలగాలని నిరంతరం వల్లించటమా ? కన్నతల్లికి- సోదరికి- చెల్లెలికి చదువుకొనే హక్కు లేదని శాసించటమా ? సమాజంలో నూటికి 80 మంది దాకా వున్న శ్రమజీవులకు చదువు సంధెల్ని అంటనీక_ దేశభద్రతలో భాగం పంచుకోవటానికి అర్హత లేకుండా చేయటమా ? ఏది మన వారసత్వం ?

# ఇకమనం — అనేది నవ్వు పుట్టించే మాట

ఈ దేశంలో— ఈ హిందూరాజ్యంలో 'మనం' అంటే ఎవరు? భారతీయులా? హిందువులా? విభిన్న సంప్రదాయాలు- వారసత్వాలు- ఉన్న సమాజం ఈ దేశంలో వుంది. కేవలం ఒక వర్గమే ఈ దేశాన్ని తన సంప్రదాయం కలదిగా- వారసత్వం గలదిగా చిత్రించటం అవివేకం- సత్యాన్ని వక్రీకరించి చూపటం.

మనం- అనేది కొన్ని కోట్లమందిని వెక్కిరిస్తూ పండ్లికిలించి చూస్తుంది. ఈ- మనం- లో కేవలం అగ్రజులకే పరిమితం- ఇదికాదనే దమ్ము- చేవ- ఏ సనాతనుడికీ, మత ఛాందసుడికీ లేదు.

మనం- లో నూటికి 90 మంది చేరరు. అట్లా చేరేట్టయితే పక్షపాతంతో రాసుకొన్న ధర్మశాస్త్రాలకు అధోగతే పడుతుంది. పరధర్మాల వల్ల దెబ్బ తగులుతున్నప్పుడల్లా, తెచ్చుకొన్న ప్రేమ ఒలకపోస్తూ పీడితుల్ని- తాడితుల్ని- సంఘ బహిష్కృతుల్ని- కలుపుకొని పబ్బం గడుపుకోవటానికి వల్లించే కొంగజపం గాళ్ళ కుతంత్రం యిది.

కులానికో కట్టు- బొట్టు- విధి, నిషేధాలు నిర్మించి, దేశంలోని ప్రజల్ని ఒకళ్ళతో ఒకళ్ళు కలవకుండా, చైతన్యవంతులు గాకుండా యిన్నేళ్ళ నుంచి- చేసింది యీ- మనం భాషాభాషితులు కాదా? ఎందుకీ వాగాడంబరం? ఎక్కడుంది హిందూధర్మంలో ఏకాత్మతా దృష్టి?

ఓహో!

"సర్వం ఖల్విదం బ్రహ్మ" తత్త్వమేవాసి" "అహం బ్రహ్మాస్మి" లాంటి తీయటి మేడిపండు పదజాలంలో లేదా? ఇంతటి విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ఏ ధర్మమూ ప్రపంచంలో బోధించదు గదా! అని డంబాలు పలుకుతారు [illegible]

ఈ మాట నిన్న మొన్నటిదికాదు. [illegible] ఈ పదాల గారడీకి బలిపశువులైన- హిందూ సామాజిక [illegible] వ్యవస్థ బయటైతే ఎన్నివేల సంవత్సరాల నుంచి, ఎన్ని కోట్లమంది [illegible]? అమాయకులైన సోదరులీ సత్యాన్ని గ్రహించకుండా మాటలకు [illegible] సత్యమనీ- పవిత్రమనీ భావించటం అవివేకం- [illegible] కోపం [illegible] అర్థమౌతుంది.

ఏకాత్మతా యజ్ఞం పేరుతో దోపిడీమూక యింకా ప్రజల్ని ఉప్పుదారిన పట్టించటానికి యత్నం చేయటం సహించరానిది. ప్రజల బాధలు- సమస్యలు పరిష్కరించే మార్గం యిదిగాదు. మతధర్మం- మతరాజ్యం- ఇంకా ఈ నేలపై పునః ప్రతిష్టించాలనే తత్వం భరించరానిది. హిందూ సామ్రాజ్యవాదం- మత సామ్రాజ్యవాదం- అన్నింటికంటె భీకరమైంది. పాశవికమైంది.

జాతిని మధ్యయుగాల్లోకి- ఇంకా చెప్పాలంటే అనాగరిక ఆటవిక దశలోకి వెనక్కి- నడిపించటమే అవుతుంది.

ఈ విషయంలో మనమంతా అప్రమత్తంగా మెలగాలి, జనాన్ని జాగృతం చేయాలి. ఏకాత్మతా యజ్ఞరహస్యం బట్టబయలు చేయాలి.

---

# " నిత్య జీవితంలో హిప్నాటిజం "

—విక్రమ్

( గతసంచిక తరువాయి )

జ్ఞానం [illegible] కాని ఇటువంటి పిచ్చిచేష్టలు ద్వారా కలిగేవి భ్రమలు, భ్రాంతు[illegible]. [illegible] హిప్నాటిస్టు హిప్నటైజు కాబడిన వ్యక్తిలో శాస్త్రీయమైన పద్ధతుల ద్వారా [illegible] కంటె గొప్ప మానసిక భ్రమల్ని కలుగజేయగలడు. అదెలా సా[illegible] వచ్చేనోట్సులో తెలుసుకుందాము. కండ్లుమూసుకుంటె సామాన్యంగా అందరికీ కనుపించే ఈ కాంతుల్ని లేక అనుభూతుల్ని "ఆత్మదర్శన మని, "[illegible]త్మజ్ఞానమని", "ముక్తికాంత" యని, ఇంకా ఎన్నెన్నో అర్థం పర్థం లేని [illegible] భాషలుపయోగించి ఈ భ్రమలనే వాస్తవాలని ఉపదేశించి బొర్రలు నింపుకునే ఆధ్యాత్మిక సాములార్లు కొందరైతే, వాస్తవానికి భ్రమకు తేడా తెలుసుకోలేక వారి భక్తి ప్రభజనంలో కొట్టుకుపోయే మూర్ఖులు మరెందరో; గంజాయి మత్తులో భ్రమల్ని అంటగట్టే ఈ దొంగగురువుల బోధనలముందు ఎల్లపుడు జాగ్రదావస్థలో వుండి సశాస్త్రీయంగ వివరించే హేతువాదుల మాటలను విశ్వసించ లేనంతటి హీనస్థితికి దిగజారిపోయారీ షిజోఫ్రేనిక్ మూర్ఖులు

భ్రమలు Hallucination:

హల్యూసినేషన్స్‌కి లోనయిన వ్యక్తి భ్రమల్నే వాస్తవాలుగా నమ్ముతూ, వాస్తవాలను పూర్తిగా విసర్జించటం జరుగుతుంది. ఈ భ్రమలు పంచేంద్రియాలకు సంబంధించినవిగా వుంటాయి.

వినికిడికి సంబంధించిన భ్రమ (auditory hanllncination):

సాధారణంగా ఇవి తిట్లుగాను, నిందాపూర్వక మైనవిగాను, ఎంతో ఆశ్చర్యం కలిగించే విధంగ వుంటాయి. షిజోఫ్రేనియా (schisophrenia), ఇన్‌వల్యూషనల్ సైకోసిస్ (in volutional psychoses) మరియు పారానోయియా para. ndia అనే మానసిక రోగాలకు గురైనవారు ఈ భ్రమలకు లోనవుతుంటారు. ఒక్కొక్కసారి వీరికి ఆహ్లాదకరమైన శబ్దాలు వినిపిస్తుంటాయి. ఆ శబ్దాలకు వీరు జవాబులుకూడ ఇస్తుంటారు. వీరికి ఆజ్ఞాపూర్వకమైన శబ్దాలు లేక పదాలు వినిపిస్తే వాటిని అమలుపర్చడానికి ప్రయత్నిస్తారు. ఇటువంటి భ్రమలకు లోనయిన వ్యక్తి ఆ ఆజ్ఞల్ని అనుసరించి ఒక్కొక్కసారి హత్యలకు ఆత్మహత్యలకు పాల్పడే అవకాశం వుంది.

"హీరా" అనే గుహలో రోజులుతరబడి ఆలోచిస్తూ కూర్చున్న మొహమ్మద్‌ప్రవక్తగారికి వినిపించిన "దివ్యవాణి" దేవదూత వాక్కుకాదని, షిజోఫ్రేనియా అనేమూర్ఛరోగానికి గురైన సదరు ప్రవక్తగారికి కలిగిన 'ఆడిటరీ హాల్యూసినేషన్'గా గుర్తించగలరు. అంతకుముందువున్న చిల్లర దేవతలు కాకుండ ఈ సృష్టికంతటికి అల్లాయేకారణం అనే అతని సిద్ధాంతం యొక్క విపరీతమైన ఆలోచనల ప్రతిరూపమే ఇట్టి భ్రమలకు కారణం.

దృష్టికి సంబంధించిన భ్రమ. (visual hallucination):

దృష్టికి సంబంధించిన భ్రమకు లోనైనవారు వివిధ రూపాలను, దృశ్యాలను చూడటం జరుగుతుంది. భగవంతుని ప్రతిరూపం కనిపిస్తే చేతులెత్తి నమస్కరించడం, ఎవరో తమకు హాని చేయడానికి వస్తున్నట్లు కనుపిస్తే వారిని ఎదుర్కోవటం గాని లేక పారిపోవడానికి ప్రయత్నించడం గాని చేస్తారు. చూపునకు సంబంధించిన

ఈ భ్రమలు సామాన్యంగా అపస్మారక స్థితిలో (tonic state) నున్నవారికి, షిజోఫ్రేనియా, పారానోయియా, మరియు డెలీరియా అనే మానసిక రోగుల్లో కలుగుతుంది. వినికిడికి సంబంధించిన భ్రమలంత తరుచుగా కాకపోయినా చాలా అరుదుగా ఈ దృష్టి భ్రమ కలుగుతుంది. ఇట్టి భ్రమలకు లోనైనవారు వాస్తవాలకు చాలా దూరంలో వుంటారు కాబట్టి ఇవి వారిలో విపరీతమైన ఆందోళన మరియు భయం కలిగిస్తాయి.

హిప్నాసిస్‌లో నున్న వ్యక్తికి అతని అభిమాన సినీనటుడు లేక రాజకీయ నాయకుడు గాని తన ముందున్నాడని, అతనితో ఇంటర్‌వ్యూ తీసుకోవలసిందిగా సూచిస్తే ఆ వ్యక్తి అదే విధంగా భ్రమ చెంది లేని సినీ నటునితో లేక రాజకీయ నాయకునితో మాట్లాడటం, జవాబు లీయటం చేస్తాడు: ఆ విధంగా హిప్నాటిజం ద్వారా దృష్టికి, మరియు వినికిడికి సంబంధించిన భ్రమల్ని కలుగజేయవచ్చు.

<u>వాసనకు సంబందించిన భ్రమ (Olfactory hallucination)</u> : ఇన్‌వాల్యూషనల్ సైకోటిక్స్ (involutional psychotics) మరియు షిజోఫ్రేనియా మానసిక రోగుల్లో ఎవ్వరికీ రానటువంటి వాసనలు వీరికి వస్తుంటాయి. దుర్వాసనలు గనుక వీరి అనుభవంలోకి వస్తే వీరు అపరాధ భావనతో బాధపడుతున్నట్లు గమనించవచ్చు.

మహాత్ములు, అమ్మలు, బాబాలను దర్శించేటప్పుడు వారి శరీరాలు సుగంధ పరిమళాలను వెదజల్లుతున్నట్లు చాలామంది భక్తులకు అనుభూతి కలుగుతుంది. చిన్నప్పటి నుండి వారిలో నాటుకున్న నమ్మకాల సజెషన్స్ యొక్క ప్రభావమే వారినలా షిజోఫ్రేనియా మానసిక రోగులుగా తయారు చేస్తుంది.

హిప్నాసిస్‌లోనున్న వ్యక్తిని ఒక ఊహాజనితమైన పూలతోటలోనున్నట్లు సూచించి, అందులో అతనికి నచ్చిన పూలను వాసన చూడమంటే అతను అదే విధమైన అనుభూతి పొంది తను వాసన చూస్తున్న పూవు 'ఫలానా' అని చెబుతాడు.

<u>రుచికి సంబంధించిన భ్రమ (gustutory hallucination) :</u>

రుచికి సంబంధించిన భ్రమ అడ్వాన్స్‌డ్ షిజోఫ్రేనియా (advanced schizophrania) అనే మానసిక రోగుల్లో సామాన్యంగా వాసనకు సంబంధించిన

భ్రమలతో కలిసి అనుభవంలోకి వస్తుంది. ఇది చాలా అరుదుగా కలిగినా సాధారణంగా చెడురుచులే అనుభవంలోకి వస్తాయి.

హిప్నాసిస్‌లోనున్న వ్యక్తి ముందు రకరకాల ఫలాలు వున్నాయని సూచించి వాటిని తినమంటే, అతడు ఎంతో ఆనందంగా వాటిని తింటూ (తింటు న్నట్లు గాల్లో యాక్షన్ చేస్తాడు) వాటి రుచి కూడా చెబుతాడు. అతడు ఒక చాక్లెట్‌నే తింటున్నాడని చెప్పి చేతికి ఒక పచ్చిమిరపకాయనిస్తే, తాను చాక్లెట్‌ను తింటున్నాననే భ్రమలో మిరపకాయను తిని, అది ఎంతో తియ్యగా వుందని చెబు తాడు. ఆ విధంగా హిప్నాటిజం ద్వారా జిహ్వకు సంబంధించిన భ్రమల్ని కలుగ జేయవచ్చు. అలాగే అడ్వాన్స్డ్ షిజోఫ్రేనియా రోగులు అనుభవించే చెడు రుచు లను నివారించవచ్చు.

## స్పర్శకు సంబంధించిన భ్రమ (Tactile hallucination):

ఈ భ్రమ డెలీరియమ్ ట్రెమెన్స్ అనే మానసిక రోగులలోను, కోకయిన్ అనే మత్తు పదార్థం సేవించిన వారిలోను కనిపిస్తుంది. సాధారణంగా ఇది దృశ్య భ్రమతో పాటుగా పనిచేస్తుంది. దీనికి గురైన వారి శరీరంపై ఏదో ప్రాకుతున్నట్లు అనిపించడం, ఒక్కోసారి ఆ ప్రాకేది కనిపించడం కూడా జరుగుతుంది

హిప్నాటిక్ నిద్రలోనున్న వ్యక్తికి అతని చేయి పూర్తిగా మొద్దుబారి పోయిందని సూచించి, అతని చేతికి ఒక సూదిని గ్రుచ్చినా కూడా అతనికి ఏ మాత్రం స్పర్శ తెలియదు.

* * * *

# డెల్యూషన్స్ (DELUSION లేక భ్రమ పూర్వకమగు ఊహ)

డెల్యూషన్స్ అనేవి అహేతుకమైన నమ్మకాల వల్ల కలిగే తప్పుడు అభి ప్రాయాలుగాను, వాస్తవాలకి చాలా దూరంగా వుంటూ, ఏ పద్ధతి ద్వారా కూడ సరిదిద్దలేనంతటి మనోదృఢత్వంగా ఆధునిక మనో వైద్యశాస్త్రం పేర్కొంటుంది. హాల్యుసినేషన్స్ అనేవి పంచేంద్రియాలకు కలిగే భ్రమ పూర్వకమైన అనుభూతు లైతే, డెల్యూషన్స్ అనేవి కేవలం మతపరమైన, పౌరాణికమైన లేక మరే యితర హేతురహితమైన నమ్మకాలవల్ల కలిగే తప్పుడు ఊహలు (అభిప్రాయాలు) గా చెప్పుకోవచ్చు. ఈ ఊహల నుండే భ్రమలు ఉత్పన్నమవుతాయి.

డెల్యూషన్‌కి లోనైనవారు భద్రతాభావం, ఆత్మగౌరవం కోసం ఒక ప్రత్యేకమైన అతివిలువ భావాలు (over valued ideas) తమలో కలగజేసుకుని

ఆత్మ సంతృప్తి పొందుతారు. తాము బుద్ధుడు, ఏసుక్రీస్తు, కృష్ణుడు అంతటి గొప్ప వ్యక్తులమని అనుకుంటూ వుంటారు. చీకట్లోకి వెళ్ళడానికి భయపడేవారు ఆంజనేయ దండకమో లేక మరే దండకమో పఠిస్తారు. అలాగే తాము పడుతున్న బాధల కన్నింటికి గతంలో తాము చేసిన పాపాలే కారణమని నమ్ముతుంటారు. ఎవరేమను కున్నా తమ గురించేనని మధనపడి పోతుంటారు. ఒక్కోసారి వీరు తమ శరీరంలో కొన్ని భాగాలు లేవని, తాము చనిపోయిన వారమని కూడా భావిస్తారు. డెల్యూషన్స్ అనేవి పారానోయ్యా, పారానాయిడ్ షిజోఫ్రేనియా మానసిక రోగుల్లో కనిపిస్తాయి. ఈ నమ్మకాలే వీరికి సజెషన్స్‌గా పనిచేసి మానసిక భ్రమం లోకి తీసుకు పోతుంటాయి.

పోలి - ఎ - డియక్స్ (Folie A Deux) :

ఇది ఒక విధమైన మానసికస్థితి. ఎక్కువకాలం ఒకే దగ్గర కలిసి వుంటు వున్నవారిలో పారానాయిడ్ భ్రమలు (Paranoid delusions) ఒకరి నుండి మరొకరికి ట్రాన్స్‌ఫర్ అవుతుంటాయి. ఈ స్థితి తల్లీ కూతుర్ల మధ్యగాని, భార్యా భర్తల మధ్యగాని, అక్కచెల్లెండ్ర మధ్య గాని లేక ప్రాణ స్నేహితుల మధ్య గాని కలుగవచ్చు. సాధారణంగా ఎక్కువ అజమాయిషీ చూపించే వారి నుండి మిగత వారికి ఈ నమ్మకాలు (delusions) మార్పిడి జరుగుతుంది.

ఉదా :- ముగ్గురు సైనికులు ఒకే కేంప్‌లో డ్యూటీ చేస్తున్నారు. ఒకరోజు సాయంత్రం నిర్జనమైన రోడ్డులో వ్యాహ్యాళికని బయలుదేరి క్యాంప్ నుండి చాలా దూరం వచ్చారు. అప్పటికే చిరుచీకట్లు క్రమ్ముకుంటున్నాయి. దూరంగా రోడ్డు ప్రక్కగా ఓ చితి, చితి నుండి పెద్ద పెద్ద మంటలు రావడం గమనిస్తారు. ఆ మంటల్లో స్పష్టమైన నీడలు- ఆ నీడలు- ఒక బాలుడు సెలాకాలిపై కూర్చుని తల వంచుకుని ఏదో వ్రాసుకుంటున్నట్లు ఆకృతి దాల్చి వుండటం ముగ్గురు స్నేహితులు గమనిస్తారు. ఇది చూసిన వెంటనే మారు మాట్లాడకుండా తిరిగి క్యాంప్‌కు వచ్చి ఎవరి [illegible] వారు కాగితంపై వ్రాసుకుని, తెల్లారి లేచి సరిచూసుకుంటే ముగ్గు రుకీ [illegible] అనుభవం ఒక్కటే : ఇక్కడ గమనించవలసింది ముగ్గురు మిత్రులూ ఒకే [illegible] వారు కావటం, కర్మసిద్ధాంతంపై ఒకే అభిప్రాయం [illegible] వారున్నా. అందుచేత ఆ నీడలు ముగ్గురుకీ ఒకే విధమైన ఆలోచనలు కలుగజేసి, దృశ్య భ్రాంతిని కలుగజేసి folie a deux అనే మానసిక స్థితికి లోను కాబడేలా

చేస్తాయి. కాబట్టి ఇద్దరు ముగ్గురు కలిసి చూసిన లేక విన్న అద్భుతాల్ని వాస్తవాలుగా నమ్మనవసరం లేదు.

సాధారణంగా మాస్ హిప్నాసిస్‌లో అందరికీ కలిపి ఒకేసారి సూచనలు ఇస్తారు కాబట్టి ఒకరి కిచ్చిన ఆదేశాలు మరొకరు అమలుపర్చడం జరుగుతుంది. ఒక్కోసారి హిప్నాసిస్‌లో నున్న వ్యక్తిని భ్రమలలోకి తీసుకువెళితే ప్రేక్షకులలో కూడా ఒకరిద్దరు suggestible వ్యక్తులు (సూచనలకు తేలికగా లొంగే గుణం కలవారు) అవే భ్రమలకు లోను కావటం, హిప్నాటిస్టు ఇచ్చే ఆదేశాలను అమలు పర్చటం జరుగుతుంది.

* * * *

## పూనకాలు (POSSESSIONAL STATES) మరియు పునర్జన్మలు (REINCURNATION)

చాలామంది భ్రమలకు వాస్తవాలకు తేడా తెలుసుకోలేరు. పారానాయిడ్ షిజోఫ్రేనియా అనే మానసిక రోగానికి గురి అయినవారు, చిన్నప్పటి నుంచి దేవుళ్ళ, దెయ్యాలు, మంత్ర తంత్రాలు మొదలైన డెల్యూషన్స్ యందు విపరీతమైన నమ్మకాలతో పెరిగినవారు భ్రమలకు లోనవుతుంటారు. ఈ కోవకు చెందిన వారే మొహమ్మద్ ప్రవక్త, రామకృష్ణ పరమహంస, బాబాలు, అమ్మలు, అవ్వలు, వగైరా, వగైరాలు. ఇంకోవిధంగా చెప్పాలంటే ఈ దేశంలో ప్రతి మానసిక రోగి ఒక ప్రవక్తే! ఒక బాబాయే! ఇటువంటి వారు దెయ్యాలు, దేవతలు శక్తులు తమకు ఆవహించినట్లు, తమతో మాట్లాడినట్లు భ్రమపడి, అదే నిజమనుకుని తమకు అతీతశక్తులున్నట్లుగా చెప్పుకుంటారు.

సాంసారిక, లైంగిక, ఆర్థికపరమైన కారణాల వల్ల ఎన్నో కోర్కెలు పుడుతుంటాయి. ఆ కోర్కెల్ని మనసులో అణగద్రొక్కటం వల్ల కలిగే మానసిక సంఘర్షణ ఫలితమే పూనకాలు పూనటం, దయ్యాలు పట్టడమూను. మానసిక బలహీనులకు కలిగే ఇట్టి పరిస్థితినే "పొసెషనల్ స్టేట్స్" అంటారు. ఈ స్థితి సాధారణంగా విద్యావిహీనుల్లోను, ఆర్థికంగా సాంఘికంగా వెనుకబడిన వారిలోను, ముఖ్యంగా పల్లెటూరి స్త్రీలలోను కలుగుతుంది. వీరు చనిపోయిన వారి ఆత్మలు,

# ఏకాత్మతా యాత్ర నగ్నస్వరూపం

—వరంగల్లు శాఖ

భారత నాస్తిక సమాజం

ప్రపంచంలో మానవ నాగరికత ఏర్పడినప్పటి నుండీ ప్రతి దశలోనూ, ప్రతి దేశంలోనూ నాస్తిక– భౌతికవాదాలను, లౌకిక వాదాలను, ప్రజాస్వామ్యాన్ని, కార్మికవర్గ చైతన్యాన్ని, పీడిత ప్రజల మధ్య ఐకమత్యాన్ని కాలరాయడానికి, సామాన్యుల అభివృద్ధికి అడ్డుగోడగా నిలబడటానికి మతం– దాని వున్మాదం మహా పిశాచంగా నిలబడింది. ప్రజలలో బానిస భావాలను, ఆచరణలను పరిస్థితులకు సరిపుచ్చుకొని పోయేటి బానిస మనస్తత్వాన్ని వ్యాప్తి చేయడానికి, ఏది ఎటుపోతే నాకెందుకులే అన్న నిర్లిప్తత, నిస్సహాయత తత్వాలను మతం పట్టుదలగా కొనసాగించుట ద్వారా నిరంకుశ రాజరికాలను ఒకప్పుడు, సామ్రాజ్యవాదాన్ని ఇప్పుడు బలోపేతం చేస్తోంది. గతించిన కాలాలలో జరిగిన యుద్ధాలకు మూలాధారంగా దోపిడీ వుత్పత్తి సంబంధాలు పునాదిగా నుండినవి. ఆ యుద్ధాలను పట్టుదలగా కొనసాగించడానికి మతోన్మాదం బలంగా వుపయోగపడింది. ప్రతిదేశంలోని మతం ఆ దేశంలోని ప్రజలలో వున్మాదాన్ని కల్గించుటం ద్వారా అంతర్యుద్ధాలకు పునాది అయింది. యుద్ధ సమయాలలో ఆయా దేశాలలోని దోపిడీ ప్రభుత్వాలకు అండగా నిలబడటం మతం యొక్క ప్రధాన కర్తవ్యమై యున్నది. ఉదాహరణకు :- సామ్రాజ్య స్థాపన కొరకు ఇస్లాం క్రైస్తవుల మధ్య జరిగిన వంద ఏండ్ల మత యుద్ధం మొదలుకొని రెండో ప్రపంచ యుద్ధం వరకూ గల యావత్తు కాలంలో మతం తన స్వంత పునాది పైననూ, రెండో వైపున జాతి దురహంకారాన్ని మతం తనలో ఇముడ్చుకొని బ్రహ్మాండమైన రక్తపాతాన్ని సృష్టించగల్గింది.

మత పర్యవసానంగా సామాన్యుడు వాస్తవిక దృష్టిని కోల్పోతున్నాడు. ప్రతి దేశంలోనూ పేదవాడు మరింత పేదవాడుగా ఆర్థికంగానూ, అధికార శూన్యుడుగా రాజకీయంగాను, హీనుడుగా సాంఘికంగానూ ఒకవైపున దిగజారి

పోవటం, ప్రజలను దోయటమే వృత్తిగా గల ధనవంతుడు ఆర్థికంగా కుబేరుడ వటం; రాజకీయాధికారాన్ని కైవసం జేసుకోవడం; సాంఘికంగా ఉన్నతుడు కావటం అనాది నుంచీ జరుగుతోంది. నేడు మూడవ ప్రపంచ యుద్ధానికి ప్రపంచ సామ్రాజ్యవాద దేశాలు సిద్ధపడుతున్నాయి. ఈ సందర్భంలోనే గతంలో కన్నా నేడు ఎక్కువగా ప్రతి మతం మత జాతి ద్వేషాలను రెచ్చగొట్టుతున్నాయి. దాని లోని భాగమే ముస్లిం దేశాలలోని ఇస్లాం మతోన్మాదం. పాశ్చాత్య దేశాలలోని క్రైస్తవ మతోన్మాదం. భారత దేశంలోని హిందూ మతోన్మాదం.

## విశ్వహిందూ పరిషత్ అవతరణ

స్వాతంత్ర్యానికి ముందు కాలంలో హిందూ మహాసభ, ముస్లింలీగ్, క్రైస్తవ మిషనరీలు తమ అనుయాయులలో మతోన్మాదాన్ని ప్రకోపింప చేయ డం ద్వారా హిందూ మహాసభ, ముస్లింలీగులు రెండూ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకృతం చేయగా క్రైస్తవం సామ్రాజ్యవాదాన్ని బల పర్చింది. దేశం పాకిస్తాన్, ఇండియాగా విభజింపబడటానికి మతోన్మాదమే ప్రబల కారణం. దేశ విభజన అనంతరం పాకిస్తాన్‌లో ముస్లిం మతోన్మాదం విలయ తాండవంతో రాజ్యమేలుతోంది. ఇండియాలోని మైనారిటీలయిన ముస్లిం క్రైస్తవు లలో వేర్పాటువాదాన్ని, ప్రత్యేకతను రెండు మతాలు పెంచి పోషించుకోగల్గు తున్నాయి. నూటికి 85 మందిగా నుండిన హిందూవులలో కులతత్వం ఏ కులానికా కులాన్ని వేర్పాటువాదంతో కూడగట్టి కులపిశాచానికి రాజకీయాధికారాన్ని కట్ట పెట్టింది. కులపిశాచాల సమిష్టి భావమే హిందూమతం.

స్వాతంత్ర్యం తరువాత ఎప్పటిలాగే భక్తి దైవం పేరుతో క్రైస్తవ మిషన రీలు [illegible] బోధించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక విధానాలను ప్రపంచ వ్యాపి తంగా అమలుపరచడానికై క్రైస్తవ సామ్రాజ్యవాదానికి అనుకూలంగా ప్రజలను [illegible]తోంది. మహమ్మదాలీ జిన్నాగారి ముస్లింలీగ్ బాగా బలహీనపడిపోయింది. దాని స్థానంలో ఇండియన్ ముస్లింలీగ్, ముస్లింలీగ్, కేరళా ముస్లింలీగ్, జమాయత్-ఎ ఇస్లామియా, ఇత్తెయిదుల్ ముస్లిమీన్ ఏర్పడినవి. ముస్లింలు వీటి క్రింద కేంద్రీకరింపబడిరి. ఇట్లా పలు సంస్థల క్రింద చీలిపోయిన ముస్లింలను సమైక్యపర్చి ఒకే సంస్థగా, వ్యవస్థగా రూపొందడానికై జమాయత్-ఎ-హిందూ-

ఇస్లామియా అన్న సంస్థ కొత్తగా భక్తి, దైవం పేర్ల మీద ఏర్పడింది. ముస్లిం మైనారిటీల ప్రయోజనాలను తానొక్కతే పరిరక్షించగలదన్న భావనను కల్పించుట ద్వారా ముస్లింల విశ్వాసాన్ని పొందడానికి ప్రయత్నించుచున్నది. దీని లక్ష్యం ఇస్లాం మతం బోధించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక వ్యవస్థను ప్రపంచవ్యాపితంగా ఏర్పర్చడానికై కొనసాగుతున్న ముస్లిం సామ్రాజ్యవాదానికి అనుకూలంగా ముస్లిం మతోన్మాదాన్ని మళ్ళించుట.

హిందూమతంలో వచ్చిన కొన్ని పరిస్థితుల ప్రభావం మూలంగా హిందూ మహాసభ జనసంఘంగా ఆవిర్భావం పొందింది. దానికి సాంఘిక పునాదిగా ఆర్. యస్. యస్. వుంది. కాలక్రమంలో భారత వుత్పత్తి సంబంధాల యాజమాన్యంలో మార్పులు సంభవించిన కారణంగా కేవలం మత సంస్థగా నుండిన జనసంఘం రాజకీయ రూపాన్ని దీసుకొంది. ఈ సమయంలోనే అది భూస్వామ్య, వ్యాపార వర్గాలకు ఆ తరువాత కాలంలో భారత పెట్టుబడిదారీ వర్గంలోని ఒక భాగానికి రాజకీయ నాయకత్వం వహిస్తూ వచ్చింది. అంతర్జాతీయ సామ్రాజ్యవాదంతో దగ్గరి సంబంధాలను కల్గి వుంది. హిందువులలోని వున్నత మధ్యతరగతి నుండి ఆ పై వర్గాలకు రాజకీయంగాను, అగ్రకులాలకు మత రీత్యాను ప్రాతినిధ్యం వహించింది. అగ్రకులాలకు చెందిన సంస్కృతినే హిందూమత సంస్కృతిగా, ప్రాచీనకాలపు రాజుల వైభవాన్నే హిందూ మహా వైభవంగా చిత్రీకరించి ప్రచారం గావించింది. 20 శాతం నుండి 25 శాతంగా నుండిన నిమ్నజాతి కులస్థులను హిందూవులుగా పరిగణించ లేదు. వారిని అంటరానివారిగానే నెట్టివేసింది. హిందూ గుళ్ళను, మతాన్ని దేవాలయాలను, దేవుళ్ళను అమెరికా మున్నగు దేశాలకు ఎగుమతి చేయటంలోనూ హరేరామ-హరేక్రిష్ణ సంస్థాపనలోనూ అమెరికన్లకు ఎంత ప్రాముఖ్యత వుందో జనసంఘానికి అంతే ప్రాధాన్యత వుంది. ఇట్టి పరిస్థితిలో జనసంఘం రాజకీయ రూపాన్ని దాల్చిన తరువాత హిందూవులలోని అగ్రకులాలవారి నందరనూ మతం పేరుతో హిందూ సామ్రాజ్యవాదానికి సేవజేసెడిదియు, పరోక్షంగా రాజకీయాలను నడిపెడి స్వచ్ఛంద సంస్థ అవసరమయింది. దాని నిర్దిష్ట రూపమే విశ్వ హిందూ పరిషత్.

## అంతర్జాతీయంగా

యావత్తు మానవా! ఇస్లాంమయం కావాలని, క్రైస్తవమయం కావాలని ఆయా మతోన్మాదాలు ఎలా కోరుకుంటున్నాయో అలాగే యావత్తు మానవాళి హిందూ

మయం కావాలని హిందూ మతోన్మాదం కోరుకుంటుంది. దీనికి విశ్వహిందూ పరిషత్ నాయకత్వం వహించుతోంది. వీరి వాదనల ప్రకారం 1. ప్రపంచంలోని అన్ని మతాలలోకెల్లా అతి పురాతనమైనదీ, అత్యంత వున్నతమైనదీ, పవిత్ర మైనదీ హిందూమత మొక్కటే. 2. సామాజిక వ్యవస్థలోకెల్లా ప్రాచీన హిందూ వ్యవస్థ వున్నతమైనది. 4. యావత్తు ప్రపంచం ఒకప్పుడు హిందూవులే. కాబట్టి ప్రపంచాన్ని హిందూమయం చేయవలసిన అవసరం ఇప్పుడేర్పడింది. అని ప్రగల్భాలు పలుకుతున్నారు. అంతేకాదు ప్రపంచం యావత్తూ ఒకప్పుడు హిందూ మతమయమే అనటానికి వారి పత్రికలో, కరపత్రంలో అనేక వుదాహరణలిచ్చారు. మచ్చుకు కొన్ని (ఎ) పాలస్తీనాలోని జెరూసలేం అంటే అర్ధం యదుషాలయం. యదుషాలయం అంటే యాదవుల ప్రభువైన కృష్ణుని దేవాలయమని అర్ధమట. కొండపై గల నిర్మాణాలను యిప్పుడు మశీదులుగా దుర్వినియోగం చేస్తున్న ప్పటికీన్నీ వాస్తవానికి అవి పురాతన కృష్ణదేవాలయాలట. (బి) లండన్‌లోని సెంట్‌పాల్ కెథడ్రల్ అసలు పేరు మొదట్లో గోపాలమందిరమట. దాని ముందు త్రిశూలం కల్గిన శివుని విగ్రహం, లోన కృష్ణుని సుదర్శన చక్రం వున్నదట. సి) ప్యారిస్‌లోని నాటర్‌డామ్ చర్చి పూర్వకాలంలో దుర్గాదేవిదట. ప్యారీస్ నగరం అసలు పేరు పరమేశ్వరీయం ఆట. రోమన్ పాలకుల కాలంలో పరమేశ్వరీయం పారిశోరియంగా మారి ఆఖరుకు పారిస్‌గా మారిందట. నాటర్‌డామ్ చర్చికి పక్కన వున్న సీన్ నది సింధూ అనే పేరుకు భ్రష్ట రూపమట. (డి) మక్కాలోని కాబా మశీదు కూడా ఒకప్పుడు విష్ణుదేవాలయమేనట. (ఇ) క్రైస్తవ కాలానికి ముందు యావత్తు ప్రపంచంలోని ప్రజలు హిందూవులేనట. ఈ విధంగా హిందూ మతోన్మాదాన్ని జాతీయంగాను అంతర్జాతీయంగానూ విస్తరించటానుకోవటం, దానికి తప్పుడు చారిత్రక ఆధారాలతో అమాయకులను నమ్మించ ప్రయత్నించటం చాలా ప్రమాద భరితమైనది.

పై ఉదాహరణలు "పిచ్చి కుదిరింది రోకలి తలకుచుట్టు" అన్న సామెతను గుర్తు తెచ్చే విధంగా వారి హిందూమయనినాదం, చారిత్రక నిరూపణలు కేవలం ఫాసిజం అభివృద్ధికే తోడ్పడుతుంది. యావత్తు ప్రపంచం ఒకప్పుడు హిందూ మయమే అని ఇప్పుడు విశ్వహిందూ పరిషత్‌వారు ఎందుకు ప్రకటించాల్సి వచ్చింది ? రెండో ప్రపంచయుద్ధానికి ముందుకాలంలో పారిశ్రామికంగా బాగా అభి

వృద్ధి నొందిన జర్మనీ పారిశ్రామిక, వ్యాపారవర్గాలకు ప్రపంచ మార్కెట్లపై ఆధిపత్యం సంపాదించాల్సిన అవసరం ఏర్పడింది. అప్పట్లో ప్రపంచ మార్కెట్టు ముఖ్యంగా బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, జర్మనీ, అమెరికాల మధ్య విభజింపబడి వుంది. అలా విభజింపబడిన దానిని హిట్లర్ కైవసం జేసుకోవటానికై జర్మన్లలో యూదు వ్యతిరేకతను, జర్మన్ జాతి ప్రపంచంలో కెల్లా చాలా గొప్ప జాతి యనియు, యావత్ ప్రపంచానికి పాలకజాతి యనియు, అసలైన సిసలైన ఆర్య జాతియని తీవ్ర ప్రచారం గావించాడు. ఇట్టి జాతి దురహంకారాన్ని తీవ్రస్థాయిలో రెచ్చగొట్టి రెండవ ప్రపంచ యుద్ధానికి కారకుడయ్యాడు. జాతి- మత దురహంకారాలు రెండూ రక్తపాతానికి చిహ్నాలు.

హిట్లర్ ఉన్మాదాన్ని గుర్తుంచుకుంటే నేటి విశ్వ హిందూ పరిషత్ వారి ఉన్మాదంలోని ఆంతర్యం తేలికగా అర్థం చేసుకోగలం. భారత పెట్టుబడిదారీ వర్గంలోని ఒక వర్గం గుత్త వర్గంగా ఎదిగి ఇతర దేశాలలో పెట్టుబడులు పెట్టటం, సామ్రాజ్యవాదులతో, బహుళజాతి కంపెనీలతో చేతులు కలిపి వెనుకబడిన దేశాలలోనూ, ఇండియాలోనూ పెట్టుబడులు పెట్టటం ద్వారా భారత్ మినీ సామ్రాజ్య వాద దేశంగానూ, రష్యా, అమెరికాల తరువాతి స్థాయిలో అగ్రరాజ్యంగా రూపొందుతున్న తరుణంలో యావత్తు ప్రపంచాన్ని భారత మినీ సామ్రాజ్యవదుల ముందు మోకరిల్ల చేయడానికే ప్రపంచం యావత్తు ఒకప్పుడు హిందూమయం అని చెప్పటంలోని రాజకీయ తంత్రం. క్రీ. పూ. 4 వ శతాబ్దం నుండి క్రీ. శ. 4 వ శతాబ్దం వరకూ నేటి ఆఫ్ఘనిస్తాన్ నుండి బర్మా వరకూ, సిలోన్ నుండి పామీర్ పీఠభూమి వరకూ మరియు ఆగ్నేయాసియా దేశాలపై బౌద్ధ హిందూమత పునాదులతో అప్పటి వ్యాపార, గిల్డు పరిశ్రమాధిపతులు అప్పటి అర్థశాస్త్రం ప్రకారం వెలసిన బ్యాంకింగ్ విధానం మరియు వుత్పత్తి సంబంధాలతో తమ సామ్రాజ్యాధిపత్యాన్ని నెలకొల్పిరి. అట్టి సామ్రాజ్యాధిపతుల సంస్కృతినే, భోగభాగ్యాలనే హైందవ మహా సంస్కృతిగా, మహా వైభవంగా పేర్కొనడాన్ని, పొగడటాన్ని అర్థం చేసుకోవాల్సిన అవసరం వుంది. శాస్త్రీయ విజ్ఞానాన్ని సామాన్య సామాజిక జీవిత విధానంలో భాగంగా చేయబడటాన్ని నిరోధించబడినప్పుడే సామ్రాజ్యాల అవతరణ సాధ్యం. శాస్త్రీయ విజ్ఞానం సామాజిక జీవిత పద్ధతి నుండి విశదీసి కొలదిమంది దోపిడీగాండ్ర గుత్తసొత్తు కాగల పరిస్థితి ఏర్పడటానికి సామాన్యులలో అంధవిశ్వాసాలను, మూఢభక్తి ఆచారాలను నూరిపోయటమే మతం యొక్క

ప్రధాన కర్తవ్యం, ఈ కర్తవ్యాన్నే విశ్వహిందూ పరిషత్ హిందూ సంస్కృతి పేరున నిర్వహించనున్నది.

ఈ విధంగా అంతర్జాతీయ సామ్రాజ్యవాదంలో భాగమైన హిందూసామ్రాజ్య వాదాన్ని, మతోన్మాదాన్ని అమాయక ప్రజల నరనరాలలో ఎక్కించటమే విశ్వ హిందూ పరిషత్ అంతర్జాతీయ కార్యక్రమం. ఈ కార్యక్రమానికి అమెరికాలోని హరేరామ- హరేకృష్ణ సంస్థ బాహాటంగా అన్ని విధాల తోడ్పాటునిస్తోంది. క్రైస్తవం ఆవిర్భవించిన తొలి రోజుల నుండి మతం ముసుగు క్రింద యావత్తు ప్రపంచాన్ని క్రైస్తవ ఆధీనంలోనికి తీసుకొని రావడానికై అనేక యుద్ధాలను నిర్వహించింది. అట్లాగే ఇస్లాం కూడా సామ్రాజ్య వ్యాప్తి కొరకు ప్రపంచంపై విరుచుకొని పడింది. ఈనాడు భారత్‌లోని హిందూ మతోన్మాదం విశ్వ హిందూ పరిషత్ నాయకత్వాన ప్రపంచంపై విరుచుకొని పడాలని అభిలషించుతోంది. మా వీయత, మానవత్వ విలువల పరిరక్షణ, మేధో శారీరక శ్రమల ఔన్నత్యాన్ని మతమన్నది గుర్తించ నిరాకరించుతుంది. మేధో శారీరక శ్రమలను దోచి హక్కు భుక్తం చేసుకొనే మతం కల్గి ఉన్నది. అంతేకాకుండా విధానాలను మానవులుగా గుర్తింపజేసెడి మానవీయత స్థానంలో అసమానతలను ఎక్కువజేసి, వ్యక్తుల గొప్పదనాన్ని చాటి చెప్పే ఉదార భావ విధానాలను మతం కలిగి వున్నది. ఇవి మతం యొక్క స్వభావిక లక్షణాలు కాబట్టి ఏ మతమైనా తన స్వభావిక బలహీనత, క్షీణించే లక్షణాలను కలిగి వున్నందున ప్రపంచ వ్యాపితంగా ఆవిర్భవించటం అసాధ్యమని, జరిగే పని కాదని చరిత్ర చెప్పే నగ్నసత్యం.

## జాతీయంగా

హిందూవులు వృత్తిని బట్టి, ఆస్థిని బట్టి, సాంఘిక హోదాను బట్టి మొదట్లో నాల్గు కులాలుగా విభజింపబడిరి. కాలక్రమంలో బానిస, భూస్వామ్య దోపిడీ వర్గ వుత్పత్తి సంబంధాలలో వచ్చిన అభివృద్ధి పరిణామం యొక్క ఫలితంగా వృత్తి విభజన, కుల విభజన వేలాదిగా జరిగింది. కులం ఒక్కటే అయినా ప్రాంతాలను బట్టి, పరిపాలనా పద్ధతులను పట్టి వేలాది కుల కట్టుబాట్లు, ఆచారాలు, అచరణలు, కర్మ సిద్ధాంతాలు, విశ్వాసాలు రకరకాలుగా ప్రజలు కలిగి వున్నారు. ఈ పరిణామం 19 వ శతాబ్ధం వరకూ కొనసాగటాన్ని గమనించగలం. వృత్తులన్నీ

భూస్వామ్య, పెట్టుబడిదారీ వుత్పత్తి సంబంధాల ఆధిపత్యంలో నుండగా రెండో వైపున కులాలు వాటి ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, జీవనసరళిలోని సాంఘిక నియమాలు వైష్ణవ, శైవ మతపీఠాల, బాబాల, అమ్మల నాయకత్వం క్రింద కేంద్రీకరించబడి వున్నాయి. వివిధ మతాల, మఠాల క్రింద చీలివున్న పరిస్థితిని అంతమొందించి హిందూవులందరి మధ్య ఐక్యతను సాధించడానికై మధ్వ-రామానుజ- శంకరాచార్యులు, కబీరు, తులసీదాసులు తీవ్రంగా ప్రయత్నించి నప్పటికిన్నీ విఫలులయ్యారు. గురునానక్, ఆక్బర్‌పాదుషాలు కుల వ్యవస్థ నిర్మూలనకు, మత సామరస్యాన్ని, సమైక్యతను దీసుకొనిరావటానికై చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. 19 వ శతాబ్దిలో స్వామి వివేకానందుడు, ఆర్య సమాజికులు వివిధ కులాల మధ్య సుస్థిర ఐక్యతను దీసుకొని రావటం ద్వారా హిందూ ఐక్యతను కాపాడటానికి, హిందూమత ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటటానికి చేసిన ప్రయత్నాలు పూర్తిగా విఫలత చెందాయి.

పైన వివరించిన అంతర్జాతీయ, జాతీయ పరిస్థితుల ఫలితంగా 1) 4 1/2 వేల కులాలుగా విభజింపబడివున్న హిందూవులను హిందూమత బ్యానర్ క్రింద ఏకం చేయటం 2) రామాయణ, భగవద్గీతల ప్రకారం పూర్తి హిందూ రాజ్యాన్ని ఏర్పాటు చేయటం. 3) దేశంలో పెరుగుతున్న నాస్తిక, సెక్యులర్, ప్రజాతంత్ర, వామపక్ష నిమ్నజాతుల, తీవ్రవాదుల, విప్లవవాదుల ఉద్యమాలను అంతమొందించటం. 4) రాజకీయ నాయకుల స్థానంలో మత గురువుల పాలనను పూర్తి మత సిద్ధాంత పునాదిపై ఏర్పాటు చేయటం. 5) ముఖ్యంగా భారతీయులను దేశీయ, విదేశీయ బడా వ్యాపార పెట్టుబడి దార్లకు కట్టుబానిసలుగా మత విశ్వాసాల పేరుతో రూపొందించడం. 6) మైనారిటీ మతస్థుల పూర్వీకులు ఒకప్పుడు హిందూవులే కాబట్టి నేటి మైనారిటీ మతస్థులను హిందూవులుగా మార్పిడి చేయటం. 7) కాలక్రమంలో మధ్యప్రాచ్యం నుండి ఆగ్నేయ ఆసియా వరకూ గల ఆసియా దేశాలను హిందూ సామ్రాజ్యంలో కలపటం. వీటిని సాధించడానికై హిందూవులను సంసిద్ధం చేయడం అన్నవి విశ్వహిందూపరిషత్ యొక్క అంతర్గత కార్యక్రమాలు.

అంతర్జాతీయంగా మధ్యప్రాచ్య దేశాలైన ముస్లిం దేశాలు నూనె సంపదతో బలమై అగ్రరాజ్యాలకు ఒకరకంగా తలనొప్పిని కలిగించుతున్నాయి. జాతీయంగా మైనారిటీలలో మెజారిటీలయిన ముస్లింలు దేశ రాజకీయాలలో మిక్కుటమైన

ప్రాబల్యాన్ని వహించగలుగుతున్నారు. ఉదాహరణకు- 1) ఢిల్లీ, పంజాబ్, హర్యానా, యు పి, మధ్యప్రదేశ్, రాజస్థాన్, బీహార్ రాష్ట్రాలలోనూ, మహా రాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులో కొన్ని జిల్లాలలో రాజకీయపార్టీల గెలుపు నకు, ఓటమికి ముస్లిం ఓట్లు ప్రధాన కారణాలలో ప్రధాన కారణం. 2) ముఖ్యంగా కేరళ రాష్ట్రంలో రెండు జిల్లాలను (28 శాసనసభ్యులు గలది) ముస్లిం మైనారిటీ జిల్లాలుగా ప్రభుత్వంచే ప్రకటింప చేయడంలో ముస్లింలు విజయాన్ని సాధించ గల్గారు. దీనివల్ల ఆ రెండు జిల్లాల్లోనూ కేవలం ముస్లిం అయిన వ్యక్తి మాత్రమే పోటీచేయవలసి ఉంటుంది. ప్రస్తుత కేరళ రాజకీయాలలోని బలాబలాలను బట్టి 28 సభ్యులుగా గల ముస్లింలు ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి లేదా పడగొట్టడానికి సమర్థతను కలిగి వుంటారు. ఈ అవకాశాలను ముస్లిం మతోన్మాదులు వుపయో గించుకోగల్గుతున్నారు. ఇది భారత పెట్టుబడిదారీ వర్గానికి నష్టదాయకమైనది. అందుకనే దోపిడీ పాలకవర్గాలు మెజారిటీ మతమైన హిందూవులను ఐక్యం చేయ టానికై విశ్వహిందూ పరిషత్‌ను స్థాపించిరి.

ముఖ్య మతాలైన హిందూవులు, ముస్లింలు వేర్పాటువాదంతో మత ప్రాతి పదికపై సమైక్యమవ్వటమంటే అర్థం నిత్యం రాజకీయ పరమైన మత ఘర్షణలు చెలరేగి భారతజాతి బలహీన పడుతుంది. రెండోవైపున కొన్ని రాజకీయ పక్షాలు రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు ఇవ్వాలన్న నినాదాలతో కేంద్రాన్ని బలహీన పర్చడం పరోక్షంగా జరుగుతోంది. ఈ రెండు అంశాలు దేశాన్ని బలహీనపర్చి విదేశీ దురాక్రమణకు దారితీసే ప్రమాదముంది. బ్రిటన్ భారత్‌ను ఆక్రమించిన విధానాన్ని సునిశితంగా చాలా జాగ్రత్తగా పరిశీలించాల్సి వుంది. అలా పరిశీలించ గల్గినప్పుడే మత వ్యవస్థ వలన జరిగే హానిసత్వాన్ని తేలికగా అర్థం చేసుకోగలం. మతాలకు అతీతమైన సామాజిక వ్యవస్థను రూపొందించుకోవటానికి, సామ్రాజ్య వ్యతిరేకమైన దోపిడీలేని వ్యవస్థ స్థాపనకు, మహోన్నతమైన విలువలను పరి రక్షించే పోరాటాలకు కుల మతాలతో నిమిత్తం లేకుండా భారతీయులు పోరాడే శక్తిని సంపాదించుకోగల్గుతారు. అట్టి శక్తిని కల్గించగల్గేది శాస్త్రీయ నాస్తికత్వం.

## విశ్వ హిందూ పరిషత్ కార్యక్రమం ఏమిటి ?

హిందూవులను ఐక్యపర్చి ఒక్కటిగా చేయడానికై విశ్వ హిందూ పరిషత్

ఏకాత్మతా యజ్ఞాన్ని నవంబరు 16 (83) నుండి 83 డిసెంబర్ 16 వరకూ ఆ సేతు హిమాచల పర్యంతరం చేస్తారు.

ఏకాత్మతా యజ్ఞం :- 1) ఇందులో ప్రధానపాత్ర వహించేది రథయాత్ర. ఈ రథాలలో భారతమాత చిత్రపటాన్ని గంగాజలాలను వుంచి వూరేగించుతారు. ఈ యాత్ర ముఖ్యోద్దేశం మహాభారత ధర్మయుద్ధంలోని రథాలను, వేదకాలపు రాజుల అశ్వమేధ యజ్ఞాన్ని హిందూవులకు గుర్తు చేయటం ముఖ్య లక్ష్యం. దీనికి ఏకాత్మతా యజ్ఞమని పేరు పెట్టారు. ఇందు 47 చిన్న చిన్న రథయాత్రలతో పాటు రెండు ప్రధాన రథయాత్రలు నిర్వహించబడతాయి.

ఉత్తరప్రదేశ్‌లోని హరిద్వార్‌లో భారతమాత దేవాలయం నిర్మించబడింది. దీన్ని భారత ప్రధాని ప్రారంభోత్సవం చేశారు. ఉత్సవానికి ఆర్. యస్. యస్. అధిపతి బాలాసాహెబ్ దేవర్స్, విశ్వహిందూ పరిషత్, సనాతన ధర్మసభ, హిందూ సమ్మేళన వగైరా సంస్థల అగ్రనాయకులు హాజరయ్యారు. భారత్‌లో నివశించే అన్ని మతాల వారికి భారతమాత గౌరవప్రదమే. పూజనీయమే. కానీ ఈ సందర్భంలో ముస్లిం, సిక్కు, క్రైస్తవమత నాయకులను పిలవలేదు. కేవలం ఒక్క హిందూమత అగ్రనాయకులే పాత్రను వహించడాన్ని గమనించినట్లయితే ప్రత్యేకంగా హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొట్టడమే కనిపించుతుంది. దాన్ని భారత గుత్తవ్యాపార పారిశ్రామిక అధిపతులకు అనుకూలంగా వినియోగించటమే ప్రధానంగా కనిపించుతుంది. ఇదే సందర్భములో సిక్కు, ముస్లిం మతోన్మాదులను హిందూవులకు వ్యతిరేకంగా వుపయోగించుకోవటానికి భారత దోపిడీ వర్గాలకు మంచి అవకాశాన్ని కల్పించటమే ఈ రథయాత్రల ప్రధానోద్దేశ్యం. ఇది భారత పాలకవర్గాల నూతన రాజకీయ వ్యూహం.

మొదటి రథయాత్ర వుత్తరప్రదేశ్‌లోని హరిద్వార్ నుండి దక్షిణాదిన రామేశ్వరం వరకూ; రెండో యాత్ర తూర్పున గల పశ్చిమబెంగాల్‌లోని గంగా సాగర్ నుండి పశ్చిమాన కల సోమనాథ దేవాలయం వరకు సాగుతాయి. 47 చిన్న రథయాత్రలు ప్రధాన యాత్రలలో కలిసిపోతాయి. ఈ రెండూ నవంబర్ 29 న నాగపూర్‌లోని ఆర్. యస్. యస్. హెడ్ క్వార్టర్సులో కలుస్తాయి. అక్కడ

నుండి విడిపోయి దేని దారిన అది ముందుకు కొనసాగి గమ్యస్థానాన్ని చేరు కుంటాయి. ప్రతి యాత్ర దినమునకు నూరు కిలోమీటర్ల దూరం కొనసాగుతుంది. ప్రతి 25 కి. మీ. దూరం నడవగానే అక్కడ రెండు గంటలపాటు ఆగి హిందూ ధర్మం బోధించబడుతుంది. ఈ రెండు యాత్రలు కలిపి 3 లక్షల గ్రామాలలో పర్యటించి 10 కోట్ల మందికి హిందూ ధర్మం తెలుపబడుతుంది. మొత్తం మీద 250 చోట్ల మజిలీలు చేస్తారు. 1700 ప్రత్యేక పూజలు నిర్వహించబడతాయి.

ప్రతి మజిలీ వద్ద అనగా యాత్ర కొనసాగిన ప్రతి 25 కిలోమీటర్ల వద్ద- హిందూవుల పునర్ వికాస వైభవాన్ని, స్వాతంత్ర్య భావస్ఫూర్తిని, ఆత్మ గౌర వాన్ని, హిందూవుల ఐక్యతా భావాన్ని, మాతృదేశం పట్ల వారి భక్తిప్రపత్తులను, మహోజ్వలతను మరోసారి స్మరించుకోవడానికే ఈ ఏకాత్మతా యజ్ఞం నిర్వహించ బడుతుందని విశ్వహిందూ పరిషత్ ప్రకటించింది. ఈ మహోజ్వల కాంతికి నిర్దిష్ట రూపం ఇవ్వటానికి ప్రతి మజిలీ వద్ద హిందూ నవ జాగరణ కేంద్రాలను ఏర్పాటు చేస్తారట. అంతేకాకుండా ప్రతి మజిలీ వద్ద రథంపై తెచ్చిన గంగాజలంలో కొంత యిచ్చి స్థానికంగా నున్న జలాన్ని రథంలో వుంచి వూరేగించుకుంటూ పోతారట.

## ఏకాత్మతా యజ్ఞంలోని ప్రధాన అంశాలను విశ్లేషించి చూద్దాం

1) ఈ యజ్ఞానికి పునాది భగవద్గీత. 2) ఈ దేశంలో నివశించెడివారి అందరి మధ్య ఏకాత్మత అనగా ఒకే రకమైన ఆలోచన, ఆచరణ, జీవనసరళిని దీసుకొని రావటం. [ఇది అసాధ్యమని భగవద్గీతే చెప్పుతోంది] 3) ప్రాచీన కాలపు మహోజ్వలలను హిందూవులకు గుర్తు చేయడానికై ఎ) భారత ధర్మయుద్ధంలోని రథాలను, బి) వేదకాలపు రాజుల అశ్వమేధ యజ్ఞాన్ని గుర్తు చేయుట. సి) గంగా నదిలోని నీటిని, భారతమాత చిత్రపటాన్ని రథంపై వూరేగించుట. డి) ప్రతి మజిలీ వద్ద హిందూ నవజాగరణ కేంద్రాలను నెలకొల్పుట అన్నవి ప్రధా నాంశాలు.

అధర్మానికి, అన్యాయానికి, హింసకు, వర్గాధిపత్యానికి, వర్గ ఆధిపత్యానికి, రంగు, జాతి ఆధిపత్యాలకు, అవివేకాలకు, దానిసత్వానికి, మానవత్వాన్ని కాల

రాయడానికి, విజ్ఞాన శాస్త్రంపై గుత్తాధిపత్యాన్ని ఏర్పాటు చేయటం ద్వారా జనంలో అశాస్త్రీయతను సామాజిక జీవిత విధానంగా నిర్బధించడానికి వుపయోగ పడేదే యుద్ధం- యుద్ధ ప్రయత్నాలు. యుద్ధం ఏ కాలంలో జరిగినా పై వాటిని స్థాపించడానికే వుపయోగపడుతుందే తప్ప దాని ధ్యేయం మరోలా వుండదు.

మహాభారత యుద్ధంలో అవలంబించబడినదంతా అన్యాయమే. రాజ్యాధికార దాహమే చావగా బ్రతికివున్నవారిని బానిసలుగా చేయటమే జరిగింది. దీన్ని ఎలుగెత్తి చాటిన నాస్తికుడ్ని రాక్షసుడన్న పేర ధర్మరాజు చంపించాడు. అని గుర్తుకు తెచ్చుకొంటే యుద్ధ రథాలను గుర్తుకు తేవటమన్న దాని ప్రధానోద్దేశ్యాన్ని గ్రహించగలం.

రామాయణం క్షత్రియులపై బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని తెల్పితే భారతం బ్రాహ్మణులతో సహా యావత్తు సమాజంపై క్షత్రియుల అధిపత్యాన్ని తెల్పింది. అశ్వమేధ యజ్ఞం రామాయణ భారతాలలో వుంది. ఈ యజ్ఞం చేయబడింది సామ్రాజ్య విస్తరణకే అన్నది స్పష్టం. ఇప్పుడు దీన్ని గుర్తుకు తేవటమంటే అర్థం హిందూ సామ్రాజ్యవాద విస్తరణకు సిద్ధం కమ్మని చెప్పటమే. మొత్తం మీద యుద్ధ రథాలను, అశ్వమేధ యజ్ఞాన్ని నిర్వహించిన తీరుజూస్తే అరాచకత్వం, రక్తపాతం స్పష్టమవుతుంది. ఈ లక్ష్య సాధనకే హిందూ నవజాగరణ కేంద్రాల స్థాపనయని అర్థం చేసుకోవటం ఏమంత కష్టం కాదు.

ఆయా మతాలు- ఇస్లాం, క్రైస్తవాలు ఇట్టి ఏకాత్మతనే ప్రపంచ వ్యాపితంగా ఆయా మతావలంబకులలో దీసుకొని రావటానికి ప్రయత్నించి విఫలమయినాయి. అన్న విషయాన్ని గుర్తుంచుకొంటే విశ్వహిందూ పరిషత్ వారి ప్రయత్నమూ తప్పక విఫలమై తీరుతుందని వేరే చెప్పనవసరం లేదు.

## దీనికి గల పునాది కారణాలెట్టివి?

1) భారతదేశంలోని హిందూమతం షుమారు 4 వేల కులాలుగా, ఉప కులాలుగా విభజింపబడి వుంది. ఈ కులాలలోని జనం వేలాది వర్గాలుగా విభజింప బడిరి. ఈ వర్గాల యొక్క- ఆర్థిక, రాజకీయ, సాంఘిక ప్రయోజనాలు పరస్పర

శత్రుత్వ మిత్రత్వ వైరుధ్యాలతో కూడుకొని వున్నది. ఈ వర్గాలు జాతీయవుత్పత్తిని అనుభవించే పద్ధతులలో విపరీత తేడాలున్నవి. వీరి జీవనసరళి విధానాలు రకరకాలు. వీటిని శాసించి అమలు జరిపేది వివిధ పాలకవర్గాలు. ఫలితాల అనుభవంలో అతి తక్కువపాలు పొందే జనం 40 శాతం నుండి 60 శాతం వరకూ గల దేశం ఇది.

2) వేలాది కులాల జీవనసరళి, ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, విశ్వాసాలు, దేవుళ్ళు, దేవతలు, దైవంపై విశ్వాసాలు ఒకే మాదిరిగా లేవు. వాటి మధ్య సిద్ధాంత పరమైన సారూప్యత లేదు. ఇవి అన్నీ పరస్పరం శత్రుత్వంతో కూడుకొని వున్నవి. వీటి యందు కనిపించే ప్రధానాంశం అశాస్త్రీయ ధోరణి, ఆచరణ మాత్రమే సారూప్యత గల్గివుంది. పై రెండు అంశాలలో మొదటిది దోపిడీ, పీడనయే వృత్తిగా గల పాలకవర్గాల ఆధిపత్యంలో నుంచే రెండోది వివిధ మతాల, మత శాఖల, మఠాల, గారడీ వేత్తలైన బాబాల, అమ్మల అధీనంలో మతం, భక్తి, దైవం విశ్వాసాల పేరుతో పీడన, దోపిడీయే ప్రధానాంశంగా కలిగి వున్నది. కాబట్టి దోపిడీకి కులమతాలకు మధ్య వైరుధ్యం ఏ మాత్రం లేదు. ఇట్టి సామాజిక వ్యవస్థ ఇలాగే కొనసాగినంతకాలం, మహోజ్వలమైన సాంస్కృతిక విప్లవం కొనసాగనంత కాలం, వర్గాల సంఖ్య పూర్తిగా అంతం కానంత కాలం, వివిధ కులాల, వివిధ మతాల మధ్య గౌరవప్రదము, సమానత్వం ఏర్పడుట ద్వారా కుల మత వ్యవస్థ పూర్తిగా ఆచరణ నుండి సమాజం నుండి అంతం కానంత కాలం, సుస్థిర శాంతికి, సంపూర్ణ మానవత్వానికి పునాదులు ఏర్పడనంత కాలం ఏకాత్మతా సాధన కలలో కూడా ఊహించరాని విషయం. ఈ విషయాన్ని హిందూమతం ఆవిర్భవించినప్పటి నుండి చరిత్ర యొక్క ఆచరణ బోధించుచున్న నగ్నసత్యం.

3) అతి ప్రాచీనకాలం నుండి ప్రతి మతంపైనా ఆధిపత్యం పాలకులదే. హిందూమతంపైన అగ్రకులాలకు చెందిన పాలకులదే ఆధిపత్యం, విశ్వహిందూ పరిషత్ పైన ఆధిపత్యం, నాయకత్వం వీరిదేనన్న విషయం హరిద్వార్‌లో భారత మాత దేవాలయ ప్రారంభోత్సవ సందర్భంగా హాజరయిన పెద్దలను బట్టి తెలుస్తోంది.

4) వెనుకబడిన కులాలను, నిమ్నజాతి కులాలవారిని అణగద్రొక్కి వుంచుట, పీడించుట అగ్రకులాలకు అనవాయితీగా వస్తున్న హక్కు. ఈ హక్కును అగ్రకులాలు వదలుకొని 750 కులాలు, ఉప కులాలుగా చీలివున్న

నిమ్నజాతి, కొండ జాతీయులను అగ్రవర్ణాలతో సమాన స్థాయిలో నాయకత్వం లోనికి దీసుకొని వచ్చుట జరుగుతుందా? ఇది జరగని పని. ఎందుకంటే శతాబ్దాల తరబడి ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా వెనుకబడిన కులాలను, దళితులను అణగద్రొక్కటమే హీనాతి హీనంగా జూడటమే, కుక్కలు చింపిన విస్తరిళ్లాగా వీరి బ్రతుకులను తయారు చేయటమే హిందూయిజంలోని ఆచరణాత్మక విధానం, సిద్ధాంతం. [భగవద్గీతలో చాతుర్వర్ణ్యమయం స్పష్టం అని కృష్ణుడే సెలవిచ్చాడు] హిందూ ధర్మాన్ని కొనసాగించటమంటే ఈ మూల సిద్ధాంత ఆచరణలను కొనసాగించటానికే విశ్వహిందూ పరిషత్ ఏకాత్మతా ప్రారంభించనున్నది.

అందుకే మహాభారత యుద్ధంలోని రథాలను, అశ్వమేధ యజ్ఞాన్ని [ఈ రెండూ రాజ్యాధికారం కొరకు హిందూవుల మధ్య జరిగిన యుద్ధాలే] హిందూవులకు గుర్తు చేయడంలోని అర్థమేమిటి? శాంతియుతంగా పరిస్థితులు అనుకూలించని సందర్భాలలో హింస ద్వారానైనా హిందూ మత వ్యాప్తిని కొనసాగించటం. అందుకై రథయాత్రల్లో ప్రతి 25 కిలోమీటర్లకు హిందూ నవజాగరణ కేంద్రాలను ఏర్పాటు చేయటం ద్వారా హిందూవుల పునర్ వికాస వైభవాన్ని, స్వాతంత్ర్య బాధ స్ఫూర్తిని, ఆత్మ గౌరవాన్ని, హిందూవుల ఐక్యతా భావాన్ని, మాతృదేశం పట్ల వారి భక్తి ప్రపత్తులను, ప్రాచీన హైందవ మహోజ్వలతను [అనగా రాజుల రాణుల గొప్పతనాన్ని, ప్రణయ కలాపాలను, వారు జేసిన యుద్ధాలను] స్మరించుకోవటానికి అన్న నినాదాల క్రింద హిందూ మతోన్మాదాన్ని నూరిపోయటం, రెచ్చగొట్టడం జరుగుతుంది. యావత్తు ఈ కార్యక్రమాన్ని నిర్వహించటానికై హిందూ నవజాగరణ కేంద్రాలన్న పేరు క్రింద ఫాసిస్టు కేంద్రాలను, బలగాలను ఏర్పాటు చేయటం గమనార్హం. ఇది భవిష్యత్తులో పూర్తి అభివృద్ధి నిరోధక కేంద్రాలుగా రూపొంది జనాన్ని నయానో, భయానో తమ అధీనంలో పెట్టుకొనుట ద్వారా దేశ రాజకీయ వ్యవస్థను నిర్ణయించే సాధికార వ్యవస్థగా రూపొందుటయే విశ్వ హిందూ పరిషత్ యొక్క రాజకీయ లక్ష్యం. ఈ లక్ష్యాన్ని అభివృద్ధి నిరోధనికి, ప్రగతి నిరోధానికి భారత పాలకవర్గం ఎంచుకొన్న రాచబాట.

## హిందూ మతోద్ధరణలోని వైరుధ్యాలు

పరిషత్ నాయకులు ఒక వైపున ఈ యజ్ఞం, యాత్రలు హిందూమత పునర్వికాసం, పునర్జీవనం కోసం అని చెబుతూనే రెండోవైపున తమ సంస్థకు

సెక్యులరిజంలో విశ్వాసమున్నట్లు ప్రకటించుచున్నారు. మతవ్యవస్థ మతరహిత సెక్యులరిష్టు వ్యవస్థ పరస్పర విరుద్ధమైనవి. వారి ప్రకటనలోని అంతరార్థం ఏమిటి? సామాన్యజనంలో సెక్యులరిజం గూర్చిన శాస్త్రీయ అవగాహన లేదు. శాస్త్రీయ అవగాహనను భారత పాలకవర్గాలు ఏనాడు ఏర్పడనీయలేదు. ఈ స్థితిలో మత పునర్జీవన వికాసమే సెక్యులరిజం అన్న దృఢమైన అభిప్రాయం దృఢంగా కల్గించటమే పాలకవర్గాలకు కావలసింది.

ఈ యజ్ఞాన్ని, యాత్రాలను హిందూమతంలో ఒక బలమైన పక్షం అయిన కామకోటి, శృంగేరి, ఉడిపి పీఠాల శంకరాచార్యులు మరియు చిన్మయానంద ప్రభృతుల ఆశీర్వాదం వున్న జ్యోతిర్మాఠ్, ద్వారకాపీఠ్ శంకరాచార్యులు వ్యతిరేకించుచున్నారు. వందలాది, వేలాది ఎకరాలను, కోట్లాది రూపాయల ఆస్థులను కలిగి వున్న ఈ పీఠాధిపతులు ప్రాచీన భూస్వామ్య వ్యవస్థకు ప్రతినిధులు. ఆధునిక పెట్టుబడిదారీ విధానానికి అనుకూలంగా హిందూమతాన్ని రూపొందించాలన్న విశ్వహిందూ పరిషత్ పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదానికి ప్రతినిధి. దేశంలో భూస్వామ్య పెట్టుబడిదారీ విధానాల మధ్య గత 25 సం॥లుగా కొనసాగుతున్న అంతర్గత వైరుధ్యం మత రూపం తీసుకోవటమే పీఠాధిపతుల వ్యతిరేకతలో నిబిడీకృతంగా దాగిన సత్యం.

గుప్త పెట్టుబడిదారీ విధానాన్ని వ్యతిరేకించే జాట్ కుల రాజకీయాధికారాన్ని వుత్తర భారత దేశంలో సుస్థిరంగా నెలకొల్పాలన్న లోక్‌దళ్, చరణ్ సింగ్, హిందూ మతోన్మాద పిశాచాన్ని పెనవేసుకొన్నదియు, వ్యాపార పెట్టుబడిదారీ వర్గాలలోని రెండవ, మూడవ శ్రేణులకు ప్రాతినిధ్యం వహించెడి బి. జె. పి. ఆర్. యస్. యస్‌లు "ఆవు కొవ్వు దిగుమతి" అన్న మిషపై ఏకత్మతా యజ్ఞాన్ని బలపర్చుతున్నాయి. విశ్వహిందూ పరిషత్‌కు ఆర్. యస్. యస్, బి. జె. పి. తదితర మతోన్మాదశక్తులు రాజకీయంగా నాయకత్వం వహిస్తున్నాయి.

కొలది కాలం క్రిందట కామకోటి పీఠాధిపతి కన్యాకుమారిలో రథోత్సవానికి ప్రారంభోత్సవం జరిపారు. ఆ వెనువెంటనే హిందూ ముస్లిం కలహాలు, సవర్ణులు నిమ్న జాతీయులపై దాడులు తమిళనాడులో జరిగాయి. ఆ రక్తం తడియారకముందే తిరిగి ఏకాత్మతా యజ్ఞం జరగటాన్ని బట్టి అనతికాలంలోనే తిరిగి భారత

వనిలో కుల, మత మారణహోమాలు రావణాసురుని కాష్ఠంలా తయారు కాబో తొందన్న విషయాన్ని ప్రతి ఒక్కరూ గమనించుట చాలా అవసరం.

కాబట్టి ఈ కార్యక్రమం వల్ల సెక్యులరిజం, నాస్తికత్వం, ప్రజాతంత్ర వుద్యమం, కమ్యూనిస్టు వుద్యమం, ప్రస్తుత వ్యవస్థను పూర్తిగా మార్చి మానవుడు తోటి మానవుడ్ని పీడించ వీలు లేనట్టిదియు, శాస్త్రీయ విజ్ఞానాన్ని సామాజిక పరం జేసి వర్గ, కుల, మతప్రసక్తి లేనట్టి నూతన వ్యవస్థ అయిన సోషలిస్టు వ్యవస్థ స్థాపనకై జరుగుతున్న విప్లవ కృషికి తీవ్ర ఆటంకమగును. పై విషయాలను దృష్టిలో నుంచుకొని శాస్త్రీయ పద్ధతిలో మత, కుల వర్గ వ్యత్యాసాలకు వ్యతిరేక ప్రచారం ద్వారా సాధారణ జనాన్ని జాగృతి చేయటం ద్వారా ప్రజాతంత్ర వుద్యమంలోనికి దీసుకొని రావలసిన బాధ్యత ప్రతి నాస్తిక, ప్రజాతంత్ర, కమ్యూనిస్టు, వామపక్ష, విప్లవ సంస్థలపైన వ్యక్తులపైన వుంది. విశ్వహిందూ పరిషత్ లోని దేశభక్తి, మానవత్వ విలువలపైన విశ్వాసం కలిగిన ప్రతి ఒక్కరూ పై విషయాలను గురించి తీవ్రంగా యోచన చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. *

---

చర్చ ముగింపు వ్యాసం

# అంబేడ్కర్ - బౌద్ధ స్వీకారం

—చేతన

అంబేద్కర్ బౌద్ధ స్వీకారం విషయం గూర్చి మిత్రులు నటరాజుగారు వ్రాసిన వ్యాసం చదివి కొందరు మిత్రులు సందేహాల్ని లేఖాపూర్వకంగా వెలి బుచ్చారు. దీని 'చర్చ' కు పెడితే విషయం తేటతెల్లమౌతుందనే సదభిప్రాయంతో వివిధాభిప్రాయాల్ని ఈ విషయంలో చర్చకు ఆహ్వానించాం.

బౌద్ధాన్ని అంబేద్కర్ స్వీకరించటంపై మొదట్నించీ వివాదంగా వున్న విషయమే. అయినా సరైన దృక్పథం ఏమన్నా వస్తుందేమో, పాఠకులు ఈ విష యంలో కొంత అవగాహనకు రావటానికి వీలుంటుందేమో అని ఆశించాం.

చర్చకు– ఆహ్వానించిందే తడవుగా ముందుగానే కాచుకొని వున్నట్టు–కొందరు అంబేద్కర్‌ని సమర్థిస్తూ, మరికొందరు వ్యతిరేకిస్తూ వ్యాసాలు రాశారు. రచయితలు మరీ ఒకరిద్దరు నిగ్రహాన్ని కోల్పోయి అవాకులూ-చెవాకులూ రాసిన వాళ్ళు కూడా వున్నారు.

అంబేద్కర్‌నీ, బౌద్ధాన్నీ కొందరు ఆకాశాని కెత్తారు, కొందరు చాలా నీచ స్థితికి దిగజార్చి రాశారు.

దీనికంతటికీ కారణం– ఆ మిత్రుల్లో ముందుగానే తిష్ట వేసుకొన్న కొన్ని సిద్ధాంతాల మీది దృఢవైఖరి. ముందుగానే తమలో కూకటివేళ్ళతో పాతుకొన్న ఖచ్చితమైన వైఖరితో– చర్చ విషయం కొనసాగించటం సమంజసం కాదు గదా! నిష్పక్షపాతంగా, వివాదగ్రస్త విషయాన్ని కూలంకషంగా పరిశీలించిన మీదటే–నిర్మాణాత్మక ధోరణిలో అభిప్రాయాన్ని వెలిబుచ్చాలి. అంటే ఎంతో నిగ్రహంతో– సునిశిత పాటవంతో తమ తమ అభిప్రాయాల్ని ప్రకటించాలి. లేకపోతే నిగట్ల గోత్రానికి సిద్ధం కావలసి వస్తుంది. ఇట్లాగే వున్నాయి. ఒకరిద్దరి వ్యాసాలు. మరీ పేలవంగా వున్న వ్యాసాలు ప్రకటించలేదు.

అంబేద్కర్‌ని పొగిడినవీ– తెగిడినవీ రెండు రకాల వ్యాసాలు ప్రకటించాం. ఇందులో మేము మధ్యవర్తులమేగాని, అంబేద్కర్ భావాలకు వ్యతిరేకులమనీ, అనుకూలమనీ ఎవ్వరూ భావించరాదు. కొంతమంది అంబేద్కర్ అభిమానులు బాధపడినట్టుగా తెలిసింది. అందుకా మిత్రులు మమ్మల్ని అపార్థం చేసుకోరాదు.

వివాదగ్రస్త విషయాల్ని పరిశీలించేటప్పుడు– సంయమనం, సహనం–ప్రధానంగా వహించాలి. అది మనం కోల్పోతే సత్యాన్ని గ్రహించలేం.

మనం– మన హృదయపీఠాలపై భద్రంగా కూచోపెట్టుకొని పూజించే వ్యక్తి ఏదైనా తప్పు చేశాడని ఇతరులంటే– దాన్ని జాగ్రత్తగా ఆలోచించి– ప్రతి కక్షి చెప్పిన దానిలో సత్యం వుంటే హుందాగా అంగీకరించే ధైర్యం, సహనం వుండాలి. లేదా– అసత్యమైతే సహేతుకంగా ఖండించే సత్తా సంపాదించాలి. అంతేగాని, ఆగ్రహం గాని, తొందరపాటు చర్య గాని పనికిరాదు. ప్రస్తుతం మనలో చాలా మందికి ఇది కొరవడినట్లుగా కనిపిస్తుంది.

నేనీ ముగింపు వ్యాసంలో ఇచిన్న వ్యాసకర్తల అభిప్రాయాన్ని మొత్తం మీద, కలిపి సమీక్షించి వ్రాస్తున్నా - అంతేగాని పేరు పేరునా ఫలానా రచయిత ఇలా అన్నాడు. అని చెప్పను. అట్లా చెప్పటం సాధ్యం గాదు. ఈ చిన్న వ్యాసంలో దాన్ని మిత్రులు అంటే అంబేద్కర్ అభిమానులు - కాని వారూ సహేతుకంగా సమీక్షించ మంటున్నా. మంచి చెడ్డలను నిర్ణయించటానికి ముందుగా మీలో జీర్ణించిన భావంపరపరంనే తులమానంగా తీసుకోక విషయానికి సంబంధించిన దాన్ని తీక్షణంగా పరిశీలించటం భావ్యమని విజ్ఞప్తి చేస్తున్నా.

రచయితల వ్యాసాల్లో చిల్లరమల్లర విషయాలు గూడా చాలా చోటు చేసుకొన్నాయి. అంబేద్కర్ మహామేధావి అని ఒకరంటే, కాదు అంబేద్కర్ మహామేధావి కానేకాదు. మేధావి, ఇంకా కాదంటే అంతకంటే తక్కువే అని యింకొకరు అన్నారు. మరీ కొందరు తమకు అంతకు ముందే ఏర్పరచుకొన్న వైరుధ్యానికి తగిన సమయం దొరికింది—అన్నట్టు ఎంతో అక్కసునుగూడా వెళ్ళబోశారు. ఇవన్నీ అనవసరమైన విషయాలు. అందుకే నేను దీంట్లో కేవలం

1) అంబేద్కర్ బౌద్ధాన్ని ఎందుకు స్వీకరించాడు.

2) బౌద్ధం—దాని స్వరూపం

3) అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరించటంలో ఔచిత్యం వుందా? లేదా?

అనే ముఖ్య విషయాల జోలికే పోదలచుకొన్నా, ఇంతకు మించి దూరం పోవటం అనవసరం. లేనిపోని గందరగోళంలో నేను పడి—పాఠకుల్ని కూడా పడవేసి దారీ-తెన్నూ లేని పాంథులుగా చేయటమే అవుతొంది.

## బౌద్ధం-దాని స్వరూపం

బౌద్ధం-ఒక వివాదాస్పద విషయంగా ప్రచారంలో వుంది. దీన్ని గూర్చి కూడా చాలామంది విభిన్నాభిప్రాయాల్ని వెలిబుచ్చుతున్నారు. ఇట్లాంటి వివాదాస్పద

పైన బౌద్ధాన్ని స్వీకరించిన అంబేడ్కర్ వివాదగ్రస్తుడు కావటంలో విశేషం లేదనుకొంటా.

కొంతమంది బౌద్ధాన్ని పీడితుల విముక్తి కోసం బయలుదేరిందని అంటారు. ఇంకా కొందరు దీన్ని ఉన్నత వర్గాల ఉపయోగపడుదానిగా అభివర్ణిస్తారు. మరీ కొందరు దీన్ని కాలం చెల్లిన దాన్నిగా చెప్తారు. ఇంకా వేరే కొందరు ఏవేవో తమకు తోచినవీ-తోచనివీ రకరకాలుగా దీన్ని గూర్చి చెప్పటం జరుగుతుంది.

ఆదిలోనే హంసపాదన్నట్టు-అసలు బౌద్ధాన్ని అర్థం చేసుకోవటంలోనే ఇక మకలు-గజిబిజివుంటే, అసలు విషయం వివాదంగా మారటంలో ఆబ్బురంగాని-అద్భుతంగాని వుండవు.

## బౌద్ధం మతమా ?

మతమంటే ఏమిటో నేను ప్రత్యేకించి యిక్కడ నిర్వచించనవసరం లేదనుకుంటా. పాఠకులు ఆ పాటి పరిజ్ఞానం లేని వాళ్ళని భావించను.

బౌద్ధం-మతంగాదు, ఇది ఒక ఉద్యమం. అయితే మనం బౌద్ధం-అనే పదం ప్రక్కన-మతం అనే పదాన్ని చేర్చి దీన్ని బౌద్ధమతం అని పిలవటం విన్నాం. దానికే అలవాటు పడ్డాం. డాక్టర్ అంబేడ్కర్‌గూడా దీన్ని అంటే బౌద్ధాన్ని మతంగానే భావించాడు. ఈ విషయంలో ఆయన తప్పుగా ఊహించాడనే అనాలి.

బౌద్ధం ఆ రోజుల్లో అంటే ఇప్పటికి దాదాపు 2½వేల సంవత్సరాల నాడు, నాటి సాంఘిక-సాంస్కృతిక-ఆర్థిక-రాజకీయ పరిస్థితులపై తిరుగుబాటు చేసిన ఉద్యమం. ఈ మాట అన్నందుకు చాలామంది మిత్రులకు వింతగా అనిపించవచ్చు. ఇంకా తీవ్రవాద మిత్రులకు కోపము-ఎగతాళి-నవ్వు కలగవచ్చు. మీరు మీకున్న విచక్షణారహిత ఆలోచనతోగాక, తరువాత కాలంలో యిదివేసిన వెర్రితలల్ని దృష్టిలోపెట్టుకొని కాక-ఆ రోజుల్లోనున్న, సాంఘిక-సాంస్కృతిక-ఆర్థిక-రాజకీయ పరిస్థితులెలాంటివి? ఈ ఉద్యమం ఎందుకు ఆవిర్భవించింది? ఆవిర్భవించి ఎవరికి ఏం చేసింది? అనే విషయాలు సూక్ష్మబుద్ధితో ఆలోచించాలి, నిష్పక్షపాతంతో అవలోకనం చేసుకోవాలి.

ఈ దృష్టితో ఆలోచించి చూస్తే-బౌద్ధం ఆవిర్భావానికి చాలా చారిత్రక నేపథ్యం వుందనేది తేట తెల్లం అవుతోంది.

బుద్ధుడి కాలం నాటికే భారతదేశంలో హైందవ సంస్కృతి సమస్తరంగాల్లో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దబడ్డది. ఆ విషసంస్కృతి ప్రభావం సోకి భారత జాతి సాంఘిక-ఆర్థిక-సాంస్కృతిక రాజకీయరంగాల్లో అసమానతలూ-అక్రమాలూ-దౌర్జన్యాలు_దోపిడీలు చోటు చేసుకొన్నాయి. వీటిని నేనిక్కడ పడికట్టు పదాలుగా వాడలేదు. ఇది నిజంగా జరుగుతున్న సమయం అది. ఈనాటికీ యిందులో కించిత్తు భేదంలేదు.

బౌద్ధం వీటిపై దాడిజరిపింది. దీనికి ఈ అందుకోసమే ఈఉద్యమంఆవిర్భవించింది. విషయంలో ఊపిరినిచ్చినవి ప్లవకారులు-లోకాయితులు అంతకుముందున్నారు.

నిజంగా ఇక్కడ మనం బౌద్ధాన్ని శ్లాఘించవలసిందే. హైందవ సంస్కృతి పరమ పవిత్రంగా బోధించే సాంఘిక చట్టాన్ని దాని నియమాలనూ చిందరవందర చేయటానికి కంకణం కట్టుకొంది, కులవ్యవస్థగా కరడుకడుతున్న చాతుర్వర్ణ విధానాన్ని త్రోసి రాజన్నది, కసరి బుసకొడుతున్న సాంఘిక కరాళ సర్పాన్ని హతమార్చందే జాతికి భవిష్యత్తు లేదని ఎలుగెత్తి చాటి ప్రజల్ని చైతన్యవంతం చేయటానికి శంఖారావం గావించింది. అణగారిన_తాడిత_పీడిత జన స్వేచ్ఛా సమానత్వాల కోసం బౌద్ధం ఆరాటపడింది. కేవలం సైద్ధాంతిక చర్చలతో ఆగక-ఆదర్శ ప్రాయమైన సంఘం ఎట్లా వుండాలో ఆచరణలో చూపటం కోసం యత్నించింది. నాటి హైందవ సమాజానికి మొత్తానికిది "ఛాలెంజి"గా ఎదురు నిల్చి పోరాడింది. బానిసల దుస్థితిని రూపుమాపటం కోసం బహు విధ పోరాటాలు సాగించింది.

ఇంకా దీన్ని గూర్చిన వివరాలు చాలా రాయవచ్చు. అయితే యిది తగిన అదనుకాదు. బౌద్ధం మతంగాదు, ఉద్యమం అని చెప్పటానికి ఇంత మాత్రం చాలు. ఇంకా వివరాలు కావాలనుకొన్న మిత్రులు E J. థామస్ రాసిన "ది హిస్టరీ ఆఫ్ బుద్ధిస్ట్ థాట్ ( The History of Buddnist Thought ) అనే గ్రంథం చదవండి. ఆయన ఆ గ్రంథంలో బౌద్ధాన్ని గూర్చిన చాలా సమాచారం అందించాడు.

ఇప్పటివరకూ బౌద్ధాన్ని మతంగా నమ్మిన మనలో చాలామందికి ఇది కటువుగా, చేదువుగా వుంటుంది. నిజాన్ని అంగీకరించటం సత్యాన్వేషకుల కర్తవ్యం అనుకుంటే తప్పనిసరిగా ధైర్యంతో ఆ పని చేయండి.

కాబట్టి బౌద్ధం కరడుగట్టిన-ఘనీభవించిన-సంప్రదాయాల పుట్ట అనీ, మత మని మన భావించటానికి వీల్లేదు. కాని కాలక్రమంలో ఈ దేశంలో దీనికి పట్టిన దౌర్భాగ్యం వల్ల దీని నిజస్వరూపాన్ని తెలుసుకొనే అవకాశాన్ని-ఓపికనూ ప్రదర్శించకుండా కేవలం పుకార్లకే-అవివేకుల రాతలకూ ప్రాధాన్యం ఇచ్చి సత్యాన్ని మరుగునపరుస్తున్నాం.

ఈ విషయంలో జైనం, బౌద్ధంకంటె ఎంతో వెనక బడిందని చెప్పొచ్చు. జైనం కేవలం-సంప్రదాయం మీదా, మూఢత్వం మీదనే దాడి జరిపిందిగాని, సమకాలీన సమాజంలో పాతుకుపోయిన చెడుపై అది దండయాత్ర చేయలేదు. కాబట్టే జైనం నేటికీ ఈ దేశంలో బట్టకట్టి బ్రతకగలుగుతుంది. హైందవ సంస్కృతి సౌధపుడొక్క పునాదుల్ని కదిలించటానికి హోరాహోరి పోరాటం చేసింది కాబట్టే బౌద్ధానికి ఈ దేశంలో నిలువనీడ లేకుండా పోయింది. ఈ నగ్నసత్యాన్ని ఎంత మంది మిత్రులు సహనంతో గమనిస్తారు? అర్థం చేసుకొంటారు—?

## బౌద్ధానికి కాలం చెల్లిందా?

ఇదేదో పిడివాదాన్ని, లేక అర్థంలేని ఆచారాల్ని, సంప్రదాయాల్ని, అహింసా సిద్ధాంతాన్ని బోధించే నిర్వీర్యమైన ఉద్యమంగా భావించి మిత్రులు—దీన్ని కాలం చెల్లిన మతంగా అభివర్ణించారు. దీనితోపాటు కాలం చెల్లిన బౌద్ధాన్ని ఆధునిక కాలంలో అవలంబించిన అంబేద్కర్ మేధావిగా-మహామేధావిగా చెప్పబడటానికి ఆస్కారం లేదని ఘంటాపథంగా వక్కాణించారు.

ఆలోచనా రహితంగా తమకు నచ్చని దాన్ని-కాలం చెల్లినదానిగా చెప్పటం సహేతుకంగాదు. సమంజసం అంతకంటే కాదు. బౌద్ధం ఎట్లా కాలం చెల్లిన ఉద్యమమో క్లుప్తంగా ఆలోచిద్దాం. దీనివల్ల యిది కాలం చెల్లిన ఉద్యమమో-కాలానికి సరైన ఉద్యమమో మనకీ నిష్పక్షపాతంగా ఆలోచించేవాళ్ళకు తప్పకుండా తెలుస్తుంది.

కాలం చెల్లిన ఉద్యమం అంటే యిది పాతకాలానికి చెందిందనే భావంతో మిత్రులు రాశారు. ఆధునిక కాలానికిది పనికిరాదనీ, ఈ కాలానికి పనికివచ్చేది యింకోటి వుందనీ వీళ్ళ భావం. దీనితోపాటు ఈ ఉద్యమంలో అతి వ్యాప్తి-అవ్యాప్తి దోషం యిమిడి వున్నా అది కాలం చెల్లిందనే చెప్పొచ్చు.

కాని బౌద్ధం నిజంగా అట్లాంటిదేనా?

బౌద్ధం మతంగాదనీ, అదొక ఉద్యమనీ భౌతికవాద పునాదితో నిర్మింపబడ్డ పీడితజనోద్యమమనీ యింతకుముందు చెప్పాం. ఆ ఉద్యమం ఆవిర్భవించటానికి దారి తీసిన పరిస్థితులు ఆ కాలంలో ఎట్లా వున్నాయోగూడా చెప్పాం. అయితే, బౌద్ధం ఆవిర్భవించిన నాటికీ-ఈనాటికీ, అంటే 2½వేల సంవత్సరాల నాటికీ-నేటికీ మనకీ దేశంలో వచ్చిన మార్పులేమిటి?

నాల్గుపడగల హైందవ నాగరాజు కసిరి బుస కొట్టుటేమైనా కల్గినదా?

కుటిల సాంఘిక ధర్మ క్రూర పంచాస్య గర్జనలు సమసిపోయాయా?

పుట్టు బానిసల దాస్య శృంఖలాలు ఫట ఫట తెగిపోయాయా?

బక్కచిక్కిన బడుగుల డొక్కలు నిండుతున్నాయా?

ఆచార శార్దూల భీకర దంష్ట్రల వాడి పోడిమి మొద్దుబారిందా?

ఇంతేగాదు, ఈ దేశంలో నాటికీ-నేటికీ మార్పు ఏ రంగంలోనూ కనిపించదు. అట్లాంటప్పుడు బౌద్ధానికి కాలం చెల్లిందని ఎట్లా చెప్పటం? అతుకూ పొంతనూ పొందని పలుకుల వల్ల ప్రయోజనం ఏముంది?

మనం యిక్కడ యింకోటి గమనించాలి.

ఒక దేశపు సామాజిక-ఆర్థిక వ్యవస్థను మార్చాలి, అని మనం భావించి నప్పుడు, తప్పకుండా ఆ దేశపు సామాజిక-ఆర్థిక పునాదులకు కారణాల్ని-అక్కడి అవ్యవస్థలకు కారణాల్ని శాస్త్రీయంగా పరిశీలించి, వాటికనుగుణంగా మనం ఉద్యమాన్ని నిర్మించి ప్రయాణం చేయవలసి వుంటుంది.

అంతేగాని, ముందుగానే మనం ఏవో కొన్ని హద్దులు, సిద్ధాంతాలు ఏర్పరచు

కాని, మరీ చెప్పాలంటే మొండిగా స్థిరపరచుకొని, మనం గీచుకున్న గిరిలోకే, ఆ దేశాన్ని, సమాజాన్ని లాక్కు రావాలని చెప్పటం ఎంతో ఆచరణ రహితమైంది, నిరర్థకమైంది. దాదాపుగా ఈ దేశంలో ప్రస్తుతం జరుగుతున్నది ఇదే అని చెప్పాలి. ఈ మాటకు ఎవ్వరికైనా కోపమూ, బాధా కలగవచ్చు. కాని, ఆలోచించటం అవసరం. దాదాపుగా 60 సంవత్సరాల నుంచి ఈ దేశంలో ఏం జరుగుతుందో, ఈ దేశంలోని వ్యవస్థను మార్చటానికి ఏ ప్రయత్నాలు జరిగాయో, అవి ఎంత వరకు విజయవంతం అయ్యాయో? కాలేదో? దానికి కారణం ఏమిటో? విశాల హృదయంతో ఆలోచించకపోతే చేయగల్గిగిందేమీలేదు.

రోగం ఒకటైతే—మందు ఇంకొకటి వాడితే, ఆ రోగం ఎన్నాళ్ళికీ నివారణ గాదు, పైగా ఆ రోగి క్రమక్రమం ప్రాణం విడుస్తాడు.

ఈ దేశపు వ్యవస్థను మార్చాలనుకొనే మిత్రులు ఎక్కడ పొరబడుతున్నారో, ఆలోచించటంలేదు! ఆలోచించినా మొండి వైఖరి అవలంభిస్తున్నారా? అర్థంగాదు. కనీసం అనుభవాల్ని పురస్కరించుకొనైనా, విధానాన్ని అనుకూలంగా మార్చుకొని ఉద్యమాల్లో పనిచేయటం విజాయితీగల ఉద్యమకారుల కర్తవ్యం. ఈ విషయం మిత్రులు నదవగాహనతో ఆలోచిస్తారని మనవి చేస్తున్నా—

## బౌద్ధాన్ని ఎందుకు స్వీకరించాడు?

ఎవరు అవునన్నా, కాదన్నా ప్రపంచంలో మహామేధావులనే వాళ్ళెవరన్నా వున్నారని అంటే వాళ్ళల్లో అంబేద్కర్ గూడా చేరతాడు.

మేధావి—మహామేధావి అని కొలవటానికి కొలబద్దలు ఎవరి దగ్గరున్నాయి? మనకు నచ్చిన వాళ్ళను, మనం మెచ్చిన వాళ్ళను మహామేధావుల జాబితాలో వేయటం పక్షపాత వైఖరితో కూడుకొన్నది. సమగ్ర పరిశీలన చేయకుండా మందుడుకుతనముతో చేసే నిర్ణయం, విమర్శ విపరీతాలకు దారి తీస్తుంది. కాబట్టి అంబేద్కర్ మహామేధావి కాదనే సాహసం ఎవరూ చేయరాదు. మొండిగా మేం చేస్తాం—! అని ఎవరైనా అంటే—తథా....స్తు

మహామేధావైన అంబేడ్కర్ బౌద్ధాన్ని ఎందుకు స్వీకరించాడు? ఇక్కడ అరగొరగావున్నా మన యిష్ట ప్రకారం గాకుండా అంబేడ్కర్ చెప్పిన దాన్నే ముందు పరిశీలించుదాం.

భారతదేశం నిచ్చెనమెట్ల సమాజానికి పుట్టిల్లు. అనే సంగతి ఈ దేశంలో ప్రతికే అందరికీ తెలుసు. ఈ సమాజ స్వభావ, స్వరూపాలు గూడా అందరికీ తెలుసు. పుట్టుకతో ఒకడు ఉన్నతోన్నతుడు. ఇంకొక్కడు పుట్టు బానిస. అంబేడ్కర్ రెండో కోవకు చెందినవాడు. మనలో కొంతమంది చెప్పినట్లుగా ఈ బానిసత్వం, ఆర్థిక అసమానతల వల్ల వచ్చిందిగాదు, కాబట్టే ఆర్థిక అసమానతల నిర్మూలనకై పోరాటం సాగిస్తే యిది ఎక్కడికీపోదు—ఈ విషయం అందరికీ తెలిసినా తెలియకపోయినా, అనుభవించేవాడికి తెలుస్తుంది.

ఈ రకమైన పనికిమాలిన సాంఘిక అసమానతల్ని పెంచి పోషించిన పెద్దరికం హిందూమతానిది. అందుకే అంబేడ్కర్ "నేను హిందువుగా చావను" అని చెప్పి, మతాన్ని మార్చుకొన్నాడు. అతడి భాషలోనే చెప్పాలంటె—

"నిమ్న జాతుల అనర్థాలకన్నిటికీ హిందూ మతమే కారణం. వర్ణవ్యవస్థ లేనిదే హిందూమతం లేదు. నిమ్న జాతీయుడు హిందూమతంలో వున్నంత కాలమూ తను పంచమ కులస్థుణని చెప్పుకోక తప్పదు. నిమ్నజాతీయుడు పంచమ కులస్థుడుగా వున్నంత కాలమూ తనకు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యలనుండి విముక్తి రాదు. అంచేత నిమ్న జాతీయుడు హిందూమతాన్ని వదలిపెట్టి సమతా స్వాతంత్ర్యాలను ప్రసాదించే మరో మతం స్వీకరించక తప్పదు. నిమ్న జాతీయుని భౌతికాభివృద్ధితో పాటు మనో వికాసానికి, వ్యక్తి పరిపూర్ణతకు దోహదం కల్పించ గల్గేది బౌద్ధమతమొక్కటే...."

"......నిమ్నజాతులుగా మాకివ్వబడుతున్న కొద్దిపాటి సౌకర్యాల కోసమే మేము హిందూమతానికి కట్టుబడి అస్పృశ్యులుగా పరిగణించబడేందుకు సిద్ధంగా లేము. సంపూర్ణ మానవత్వం సాధించేందుకై మేము పోరాడుతున్నాం. నేను హిందూమతాన్ని వదలివేస్తానని 1935 స॥లోనే ప్రకటించాను. అన్యమత స్వీకారం విషయంలో భారతదేశంలోని మతాల్లో వుత్కృష్టమైనదాన్ని, భారతీయ సంస్కృతికి

ప్రతిబింబమైన దాన్నే, స్వీకరిస్తానని గూడా లోగడ ప్రకటించా. రేపటి ధర్మదీక్ష కార్యక్రమంలో లక్షలాది నిమ్న జాతీయులు పాల్గొంటారు. ఇది రేపటితో ఆగదు.............ఆత్మగౌరవం గల నిమ్న జాతీయులంతా హిందూమతాన్ని వదలి వేసి బౌద్ధమతాన్ని స్వీకరిస్తారు........"

..........."సనాతన మతాన్ని వదలివేసిన మనమీనాడు తిరిగి జన్మించాం, దేవుని అవతారాలు, కర్మ, పునర్జన్మ అంతా బూటకం........"

"కేవలం మతాలతోనే మానవుడు జీవించలేడు. మనో వికాసానికి, జీవిత సార్థకతకూ, మతం చాలా అవసరం. అందుకే లక్షలాది నిమ్న జాతీయులు బౌద్ధ మతం స్వీకరించారు—"

"ఆర్థికరూపమైన ప్రయోజనాల కంటె ఆత్మగౌరవమే మానవుడికి ముఖ్యం. బొంబాయి నగరంలో మధ్యలో ఆరంతస్తుల మేడపై పట్టు పరుపులమీద పవ్వళిస్తూ కోడికై మాలతో బహు దర్జాగ బ్రతుకుతోంది వేశ్య. అదే మేడ క్రింద చాలీచాలని పూరి గుడిసెలో కాపురముంటూ, రాళ్ళుగొట్టి, వచ్చిన కూలీ డబ్బులతో చాలీచాలని తిండి తింటూ జీవనం గడుపుతుంది ఒకానొక పేదరాలు. ఈ పేదరాలు ఆ ఆరంతస్తుల మేడపైకెళ్ళేందుకు సిద్ధమైతే తానూ ఆ వేశ్యలాగే సర్వసుఖాలూ అనుభవించవచ్చు. కాని, ఆ పట్టువరుపులకంటె, చికెన్, కైమాలకంటె ఆత్మగౌరవమే తనకు ముఖ్యం. ఈనాడు మా పోరాటమంతా ఆత్మగౌరవం కోసమే. సమాజంలో నలుగురితో పాటు సమానంగా బ్రతకటం మానవుల జన్మహక్కు. ఈ హక్కు కోసం మేమెంతటి త్యాగానికైనా సిద్ధమే—"

"ఈ పోరటం అధికారం కోసంగాని, ఐశ్వర్యం కోసంగాని ఉద్దేశించినట్టిది గాదు. స్వేచ్ఛకోసం మనమీ పోరాటం సాగిస్తున్నాం. మనలో మానవతా శక్తిని పెంపొందింపుకొనేందుకై మనమీ పోరాటాన్ని చేపట్టాం—"

ఇవి ఇంకా వున్నాయి. తన మత పరివర్తన విషయంలో అంబేద్కర్ చెప్పుకొన్న మాటలివి. ఇంకా ఈయన బౌద్ధ స్వీకారాన్ని గూర్చి పరిశీలించిన వారిచ్చిన అభిప్రాయాలున్నాయి. వాటి సారాంశం నాలుగు మాటల్లో చెపుతాం....

1) మానవజాత్యభ్యున్నతికి సృజనాత్మకమైన ఆలోచనకావాలి.

2) మానవుడు స్వీయ గౌరవ ప్రతిపత్తిని పొందటానికి కావలసిన స్వేచ్ఛ కావాలి.

3) అణగారిన మానవజాతి ఉత్తమ స్థాయికి ఎదిగి, ఉన్నత జాతిగా రూపొందాలి.

4) బానిసత్వానికి- పీడనకు ఎగురుతిరిగి మానవుడు నిలబడాలి.

5) మానవులందరికీ భౌతికావసరాలను తీర్చిదిద్దగలిగేట్టు, సంప్రదాయబద్ధమైన సమాజం సమూలంగా మారాలి.

6) సంఘ బహిష్కృతులైన మానవులంతా, మానవులుగా గుర్తింపబడాలి.

అంబేడ్కర్ చెప్పిన దాన్ని దృష్టిలో పెట్టుకొని మిత్రులు ఒక్కసారి ఆలోచిస్తే, అతడు బౌద్ధాన్ని ఎందుకు స్వీకరించాడో అవగతం అవుతుంది. వేల సంవత్సరాల నుంచి పశువుల కంటె నికృష్టంగా చూడబడుతున్న కోట్లాది ప్రజానీకానికి హిందూ మతంలో వున్నంత కాలం పశు గౌరవం కూడా లభించదనే సంగతి అంబేడ్కర్ అనుభవించాడు. ఆ తపనను అర్థం చేసుకోవాలి, ఆ బాధను అవగతం చేసుకోవాలి. తిలక్ లాంటి వాళ్ళు ఈ జాతినుద్ధరిస్తామని ఎన్నో సంఘాలు పెట్టారు. కాని అవన్నీ కన్నీటి తుడుపులే. ఆయా జాతికి లవి ప్రతిబింబాలే తప్ప బడుగు జనాన్ని ఉద్ధరించేవి గావు.

ఆర్థిక పోరాటాలు అన్ని సమస్యలకు పరిష్కారం చూపవనే విషయం కొంచెం విశాల దృక్పథంతో ఆలోచిస్తే అందరికీ తెలిసే విషయం. కాని అంత ఓపికా, సహనమూ, ఆలోచనా లేని మిత్రులకు మాత్రం అదంటె చిరాకు-కస్సుబుస్సు.

అయితే అంబేడ్కర్

## బౌద్ధాన్ని స్వీకరించటంలో ఔచిత్యం వుందా?

బౌద్ధాన్ని గూర్చి క్లుప్తంగా తెలుసుకొన్నాం. అట్లాగే అంబేడ్కర్ బౌద్ధాన్ని ఎందుకు స్వీకరించాడో ఆయన మాటల్లోనే కొంత ముఖ్యమైన దాన్ని తెలుసు

కొన్నాం. తరువాత ఇతడు బౌద్ధాన్ని స్వీకరించటంలో ఎంత ఔచిత్యం వుందనేది ఒకరకంగా అనవసరమే అవుతుంది. కాని మిత్రుల గందగోళంవల్ల దీన్ని స్పష్టం చేయవలసిన అవసరం వుంది.

అంబేడ్కర్ స్వీయ గౌరవం కోసం బౌద్ధాన్ని స్వీకరించాడన్నారు. కాని యిక్కడ ఓ విషయం మనం మరచిపోరాదు. డా॥ అంబేడ్కర్ బౌద్ధాన్ని, మతంగా భావించాడు. పైగా ఇది భారతీయ సంస్కృతికి ప్రతిబింబం అని అంటు న్నారు. ఈ రెండు రకాల అభిప్రాయలూ చాలా విరుద్ధమైనవే.

బౌద్ధాన్ని మతంగా భావించటం అంబేడ్కర్ చేసిన పొరపాటే. దీనికి కారణం తన నాటి అపోహలు, అదిగాక మానవుడు మతం లేకుంటే మనుగడ సాగించలేడనే దురభిప్రాయం అంబేడ్కర్‌కి వుంది. మానవుడ్ని నీతిమార్గంలో నడిపించేది మతం- అనే అపోహ అంబేడ్కర్‌కి వుండటం చాలా విచిత్రంగా వుంది. ఎందుకంటే- దైవాన్ని, కర్మసిద్ధాంతాన్ని, పూర్వజన్మ పునర్జన్మలనూ, స్వర్గ నరకాలనూ తిరస్కరించిన అంబేడ్కర్ మతానికి తావివ్వటం అర్ధరహితం. మరి అంబేడ్కర్‌ని ఆకాశానికెత్తే మిత్రులు ఈ విషయంలో ఏం సమాధానం చెప్పి సరిపెట్టుకుంటారో అర్థం కాదు.

దీనికోపాటే 'భారతీయ సంస్కృతికి ప్రతిబింబం' అని చెప్పటంలో అంబేడ్కర్ ఉద్దేశం ఏమిటి? ఏది భారతీయ సంస్కృతి? ఈ విషయంలో మత వాదుల సంస్కృతి వేరు, భౌతికవాదుల సంస్కృతి వేరు. కులవ్యవస్థనూ- అంట రానితనాన్నీ- దైవవిశ్వాసాన్నీ, దాన్ని ఆధారంగా చేసుకొని వచ్చిన ఇతర అభి ప్రాయాలనూ మొత్తం తోడి పెట్టాలని చెప్పిన అంబేడ్కర్- భారతీయ సంస్కృతిగా దేన్ని గౌరవిస్తున్నారు మత సంస్కృతిని గౌరవిస్తే ఆయన చెప్పిన దంతా అర్ధమేగాదు. భౌతికవాదుల అభిప్రాయాన్ని గౌరవిస్తుంటే, బౌద్ధాన్ని మతంగా అంగీకరించటం దాన్ని పెద్దఎత్తున ప్రచారం చేయటం అసంబద్ధంగానే వుందని భావించాలి.

మతానికి ఇతడు తన జీవితంలో ప్రాధాన్యం యిచ్చాడు. మతం జీవం లేని పిడివాదం అన్న సంగతిని మరచాడో, ఆవేశంలో గుర్తుకు రాలేదో తెలియదు- అందుకే మార్క్స్ చెప్పిన 'మతం మానవజాతికి మత్తుమందు' అనేది ఈయనకు గిట్టలేదు_ ఈ విషయంలో అంబేడ్కర్.

## పెద్ద పొరపాటు చేశాడు

"మార్క్స్ సిద్ధాంతాన్ని నమ్మేవారు మానవుడికి మతమవసరమనే విష

యాన్ని అంగీకరించరు. మానవుడికి మతం మత్తుమందులాంటిదని మార్క్స్ మహాశయుడే అన్నాడు గదా! తిను, త్రాగు, సంతోషంగా జీవించు, మతం గొడవ దేనికి? ఇదే వారి వాదం. ఈ వాదంతో నేను మాత్రం ఏకీభవించజాలను. తిను, త్రాగు, సంతోషించమనే భౌతిక వాంఛలతోనే సరిపెట్టుకొంటే యిక మానవుడికి మృగానికి తేడా ఏమిటి? మానవుడికి మనస్సనేది వుంది. శరీరం ఆరోగ్యంగా లేనప్పుడు రోగాలు శరీరాన్నెలా ఆవరిస్తాయో, మానవుడి మేధస్సు ఆరోగ్యంగా లేనప్పుడు దాన్ని ఆశ్రయించే రోగాల వల్ల చాలా ప్రమాదకరమైన ఫలితాలేర్పడతాయి—"

అంబేద్కర్‌కి వున్న ఈ అభిప్రాయాన్ని చూస్తుంటే- నిజంగా మతం ఎంత మత్తుమందుగా పనిచేస్తుందో వేరే నిదర్శనం అనవసరం.

"ఋణం కృత్వా ఘృతం పిబేత్" అని భావవాదులు చేసిన విమర్శకూ, అంబేద్కర్ చేసిన విమర్శకు భౌతికవాదం పట్ల భేదం ఏమిటో చెప్పగలమా? ఈ విషయంలో అంబేద్కర్ ఎంతో పొరపాటు పడ్డాడనే భావించాలి. మతం పట్ల అతనికున్న అభిప్రాయమే ఈ పని చేయించింది.

అన్ని రంగాల్లో భౌతికవాద అభిప్రాయాల్ని వెలిబుచ్చిన అంబేద్కర్ మతం వద్దంటే- ఇంత ఉలిక్కిపడటం అనాలోచిత చర్యే అవుతుంది.

ఈయనొకచోట- "ఈనాడు మనం సాగిస్తున్న ఈ పోరాటం, మనసా, వాచా ఆధ్యాత్మికమైనట్టిది"- అని అంటాడు. బౌద్ధాన్ని స్వీకరించటం- ఆధ్యాత్మికం- అని అనటంలో అర్థం ఏమన్నా వుందా?

ఆధ్యాత్మికం అంటే ఏమిటి?

అందుకే అంబేద్కర్ ఏంచేస్తున్నాడో ఆలోచించక తప్పటడుగు వేశాడనే చెప్పాలి. ఇక్కడ ఎవ్వరూ బాధపడనవసరం లేదు. నిజాన్ని అంగీకరించటంలోనే మన నిజాయితీ- సత్యశోధనాసక్తి- ఆధారపడి వుంటాయి.

భౌతికవాదంపై డా॥ అంబేద్కర్‌కి ఉన్న అభిప్రాయం చాలా పేలవమైంది.

ఇట్లాంటి తప్పులు బహుశః అంబేద్కర్ లాంటి వాడు చేయకుండా వుండవలసింది. మరి దీన్ని చూస్తే ఏ భౌతికవాదికైనా అంబేద్కర్‌పై ఆగ్రహం కలగటంలో అసంగతమేముంది?

***

# ఆర్. యస్. యస్. నగ్న స్వరూపం - 11

తమిళమూలం:- గంగై కొండన్ అనువాదం :- గౌతం ప్రకాశ్

(గత సంచిక తరువాయి)

హిందూ మతవాదులను కూడగట్టి, పోరాటాలు సల్పి బ్రిటీషువారి నుండి "హిందూ రాష్ట్రాన్ని" సాధించాలన్న వాదాన్ని నెహ్రూ అంగీకరించలేదు. అందు వలన నెహ్రూ 'స్వతంత్ర ప్రకటన' ను వ్యతిరేకించిన హెడ్గేవార్ నెహ్రూకు సన్నిహితమై అతన్ని పెడత్రోవ పట్టించటానికి సిద్ధమయ్యాడు. గాంధీని ఒకింతగా అతని మార్గం నుండి మరల్చగలిగామన్న సంతోషమే ఈ పనికి ఊతమిచ్చింది.

1930 జనవరి 26 వ తేదీన స్వతంత్ర దినంగా గణించాలని కాంగ్రెస్ పార్టీ ప్రకటించింది. ఈ సందర్భాన్ని వుపయోగించుకోవాలనుకొన్నాడు. ఆర్. యస్. యస్. శాఖలన్నింటికి ఈ క్రింది "లిఖిత విజ్ఞప్తి" ని పంపించాడు హెడ్గేవార్.

"భారత జాతీయ కాంగ్రెస్ 'మన' స్వాతంత్ర్య కాంక్షను అంగీకరించింది. ఈ కాంక్షను బలపరిచే ఏ సంస్థకైన ఆదరణ యివ్వటమే మన కర్తవ్యం."

26-1-1930 లో జరిగిన ఆర్. యస్. యస్. ఊరేగింపులు జరిపి వారి జండా 'భాగ్యధ్వజ' ను ఎగురవేసారు. దీనిపై డి. ఆర్. గోయల్ తన పుస్తకం ఆర్. యస్. యస్. లో ఇలా వ్రాస్తున్నారు. ఆర్. యస్. యస్. విజ్ఞప్తి హెడ్గేవార్ అంతరంగిక అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. స్వతంత్రం పొందాలనే కాంక్షను కాంగ్రెస్ అంగీకరించటమే ఆర్. యస్. యస్. విజయంగా భావించాలని హెడ్గేవార్ ఆశించారు. లిఖితపూర్వక విజ్ఞప్తులను పంపటం ఆర్. యస్. యస్. చరిత్రలోనే లేదు. ఈనాటికి కూడా.

సాధారణ ప్రజలు తమ సంస్థపై దురభిప్రాయాన్ని తొలగించుకోవాలనే 'లిఖితపూర్వక విజ్ఞప్తి' వెనుక రహస్యం. తమకీ దేశభక్తి ఉందహో అని ప్రకటించుకోవటం వారికున్న పెద్ద తాపత్రయం,

ఆ రోజు నిర్వహించిన కార్యక్రమంలో కూడా వారి హిందూరాష్ట్రవాదాన్ని నొక్కి చెప్పారు. దేశీయ పతాకంగా వారు గౌరవించేది త్రివర్ణ పతాకాన్ని కాదు. నేటికీ వారి 'భాగ్యధ్వజాన్నే' ఆనాటి 26 వ తేది జనవరి నాడు తప్ప మరె సంవత్సరం వారు స్వాతంత్ర్య దినం జరుపలేదు. అయితే కాంగ్రెస్ మాత్రం ప్రతి యేటా జరుపుతున్నారు. దీన్నిబట్టి ఆర్. యస్. యస్. వారి ఉద్దేశాలు అర్థం చేసు కోవచ్చు. అని గోయల్ తన పుస్తకం 68-69 పేజీల్లో వ్రాసారు.

అప్పుడే కాదు. ఇప్పుడూ ఆర్. యస్. యస్. దేశభక్తియుత సంస్థ అని బ్రాహ్మణ వర్గాలు చెప్తున్నాయి. ముఖ్యంగా తమిళ బ్రాహ్మణ పత్రికలకు అదే పని. అయితే ఇది కూడా పస లేని వాదనని ఈ క్రింది సంఘటన నిరూపిస్తుంది

గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం రెండవ ఘట్టంగా 1930 లో ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. అప్పటికి ఆర్. యస్. యస్. వాదుల పరిస్థితి ఏమిటి ? దీన్ని గూర్చి డి. పి. మిశ్రా తన స్వీయ చరిత్రలో 'LIVING AN ERA' అనే పుస్తకంలో మొదటి అధ్యాయం 164 పేజీలో ఈ విధంగా వ్రాసాడు.

"1930 వ సంవత్సరం సత్యాగ్రహ పోరాటం ఆర్. యస్. యస్. వారిని ఇరకాటంలో పడేసింది. సత్యాగ్రహ పోరాటానికి ప్రజలిస్తున్న సహకారాన్ని చూసి వారు బహిరంగంగా వ్యతిరేకించలేక ఊగిసలాడారు. ఆదరణ చూపించక పోతే నాయకత్వం మరెవరి చేతికైన వెళ్ళిపోతుందని భయపడి ఆదరణ ప్రకటించారు. 'ముంజీ' ఈ సత్యాగ్రహంలో పాల్గొన్నప్పటికీ తన సిద్ధాంతాలను వదల లేదని ప్రకటించిన తరువాతే ఉద్యమంలో పాల్గొన్నారు.

## 'హెడ్గేవార్, గోడ్సేలు పాలసీ మిత్రులు కూడా'

ఆ సమయంలో హిందూ మహాసభకు ఆర్. యస్. యస్. కి దగ్గర సంబంధాలుండేవి.

గాంధీని చంపిన గోడ్సే హిందూ మహాసభకు చెందినవాడని తెలిసిన వెంటనే తమకూ, హిందూ మహాసభకు ఎట్టి సంబంధాలు లేవని చెప్పుకున్న ఆర్. యస్. యస్. వారు 'నిజం' చెపుతున్నారా ?

మనం చెప్పుకున్న పై పరిస్థితుల్లో హెడ్గేవార్ హిందూ మహాసభకు కార్యదర్శిగా వుండేవారు. ఆర్. యస్. యస్. ను స్థాపించిన ఏకైక నాయకుడిగా గుర్తింపబడిన కాలంలో ఆయన హిందూ మహాసభ కార్యదర్శి. హిందూ మహాసభ నాయకులను ఆర్. యస్. యస్. శాఖలకు రప్పించి రాజకీయ శిక్షణలు నిర్వహించే వారు. 1931 ఆగస్టులో 'అగోలా' లో హిందూ మహాసభ నొకదాని ఏర్పాటు చేసి, దాని నిర్వహణ బాధ్యతను పూర్తిగా ఆర్. యస్. యస్. వారే చేసికొని జరిపించారు. హిందూ మహాసభ నాయకుని ఊరేగిస్తున్నప్పుడు ప్రజలు రాళ్ళు రువ్వినపుడు అతన్ని రక్షించింది ఆర్. యస్. యస్. వారే.

1931 లో పాపారావ్ సావర్కార్ ఆధ్వర్యంలో ఉన్న 'ధర్మహిందూ సభ' అనే సంస్థ ఆర్. యస్. యస్. లో కలసిపోయింది.

పాపారావ్ సావర్కార్ హెడ్గేవార్‌కు అనేక సహాయాలు చేశారు. ఢిల్లీలో ఆర్. యస్. యస్. శాఖా కార్యక్రమాలు ఇతనే ప్రారంభించాడు. ఢిల్లీలోని హిందూ మహాసభా భవనంలోనే హెడ్గేవార్ ఉండేవారు. చుట్టుపట్ల నగరాలలో శాఖలను ప్రారంభించటంలో సహకరించింది ఈయనే. ఇతడితో దగ్గర సంబంధాలు ఆర్. యస్. యస్. కు 'హిందూ మహాసభ' కు ఉండేవి.

ఢిల్లీ పరిసర ప్రాంతాల్లో ఆర్. యస్. యస్. శాఖల నేర్పాటు చేసేటప్పుడు హెడ్గేవార్ వెంట ప్రతిచోటికి వెళ్ళే వ్యక్తి ఎవరో మీకు తెలుసా?

అతడే గాంధీని చంపిన నాథూరాం గోడ్సే.

జె. ఎ. కురాన్ వ్రాసిన "మిలిటెంట్ హిందూయిజం" ఇన్ ఇండియన్ పొలిటిక్స్ అనే పుస్తకంలో 18-19 లో ఈ క్రింది విధంగా వుంది.

"ఆర్. యస్. యస్. ను పలునగరాల్లో ఏర్పాటు చేయటానికి హెడ్గేవార్ ప్రయాణాలు సాగిస్తుండేవారు. ఆ ప్రయాణ సందర్భాలలో అతని సలహాదారుగా నాథూరాం గోడ్సే వుండేవారు. ఇతడే ఆ తరువాత 16 సంవత్సరాలకు గాంధీని చంపాడు. గోడ్సే 1930 లో ఆర్. యస్. యస్. తో కలిసాడు. అతడొక మంచి వక్త. సంస్థలను ఏర్పర్చటంలో మంచి నిపుణుడు అనే అభిప్రాయంతో అతనికి మంచి ప్రాముఖ్యం యివ్వబడింది.

గోడ్సే కూడా చిద్పవన బ్రాహ్మణుడే. హెడ్గేవార్ కూడా చిద్పవన బ్రాహ్మణుడే. ఇద్దరిదీ ఒకే పాలసీ. ఇంకా చెప్పాలా వీరి సంబంధాల గురించి?

(ఇంకా వుంది)

కథ

# పిండం

—బి. ఉమాశంకరరావు M. A.

"ఒరే చిన్నోడా నీకు బొత్తిగా దేవుడన్నా, దెయ్యం అన్నా నమ్మకం, భయం లేకుండా పోయింది. కొంచెం వాడి మాట వినకూడదూ" అంటు సుందరమ్మ గారు చిన్నవాడిని మందలిస్తున్నారు.

ప్రక్కనే కూర్చున్న అగ్నిహోత్రుల శాస్త్రిగారు కొంచెం కంగారుగా "నాయనా! వెధవది రెండువందల రూపాయల ఖర్చుకు అలా వెనకంజ వేస్తూ, అవని, ఇవని, నా పిండా కూడు నాస్తికత్వం గీస్తికత్వం అని ఏవేవో విపరీత వాగుడు వాగేస్తున్నావు. మన పూర్వీకులు మరీ అంత వెర్రివాళ్ళటయ్య, వారికి ఆ మాత్రం జ్ఞానం లేకుండా ఇలాంటి శార్ధాలు, పిండాలు, కర్మలు, పూజలు, యజ్ఞాలు పెడతారటయ్య" శాస్త్రిగారు నేను ప్రస్తుతం మాట్లాడుతుంటి కూడా మీ పిండాకూడు సంగతేనండి. అంటూ చిన్న నవ్వు నవ్వాడు రాజు.

అంపలోని ద్వందార్థం అర్థం చేసుకున్న శాస్త్రిగారు కొంచెం కోపంగా "చూడండి సుందరమ్మ గారు మీ వాడు మరీ మితిమీరు పోతున్నాడు" "నా పిండా కూడు అంటున్నాడు."

"శాస్త్రిగారు నేను అంటున్నది మీ పిండా కూడు గూర్చి కాదండి బాబూ మా నాన్నగారిది" అన్నాడు రాజు.

"శాస్త్రిగారు ఎలాగైనా ఒక వందరూపాయలతో సరిపెట్టుకోండి మిగిలిన విషయాలు నేను చూసుకుంటునన్నానుగా" అన్నాడు రామం. వీలైనంత త్వరగా ఈ తతంగం ముగించాలని చూస్తున్నాడు.

"ఆరు నూరు అయినా, నూరు ఆరు అయినా ఈ పిండ ప్రదానం జరపటానికి వీలు లేదు."

"అడుక్కున్నవాడికి ఒక ముద్ద వెయ్యరు గాని ఈయనకు కర్మలు, శ్రాద్ధాలు అంటూ వందలు ముట్ట చెబుతున్నారు. చనిపోయి వారం రోజులైపోతున్న సమయంలో మీరు నదిలో ఇంత భోజనం పెడుతుంటే అతనికి ఎలా అందుతుంది? అందదు మూమ్మాటికీ అందదు. సజీవంగా ఉన్న నాకే అందకపోతే ఏనాడో నిర్జీవమైపోయిన వారికెట్లా అందుతుంది. ఇది కేవలం మూఢాచారం, బ్రాహ్మణులు పెట్టిన కట్టుకథ మాత్రమే. తినడానికి కొన్ని ప్రాథమిక అవయవాలు, నోరు, నాలుక, దంతాలు కావాలి. అవి ఏనాడో మట్టిలో కలిసిపోయాయి. ఇది మరెలా సాధ్యం. పిండమే కాదు, ప్రసాదం కూడా అంతే. అది ఎప్పటికీ ఎవరికీ అందదు. పెట్టినవారు తినడానికి మాత్రం పనికివస్తుంది. ఎందుకు నేను ప్రక్క వీధిలో ఉంటాను. మీరు ఇంటి దగ్గర భోజనం పెడతారా ? నాకు అది అందుతుందో లేదో చూస్తాను."

"ఒరే చిన్నా ఏమిటీ అపశకునం మాటలు. నోరు మూస్తావా లేదా ?" అంటూ పాపం పుత్ర ప్రేమ కొద్దీ కోపగించుకుంది సుందరమ్మ.

ఈ ధోరణిలో వితండవాదం చేయడం పంతులు గారికి కొంచెం చికాకు వచ్చి పడింది. వెంటనే కుర్చీలో నుంచి లేచి పోయారు. "సుందరమ్మగారు ! నన్ను ఉంచుతుంటారా ? వెళ్ళమంటారా ? వెధవది వందరూపాయలు కోసం ప్రొద్దున్నే వచ్చి నానా అపశకునపు మాటలు వినవలసి వస్తుంది" అంటూ వీధి గుమ్మం వైపు నడిచారు శాస్త్రిగారు.

"ఆగండి బాబు ! వాడిమాటలనేం పట్టించుకోకండి. మీ ఇష్ట ప్రకారమే మంగళవారం నాడు కార్యక్రమం నడిపించండి" అంది సుందరమ్మ కళ్ళంట నీళ్ళు పెట్టుకుంటూ. వెంటనే శాస్త్రిగారు పై మీది శాలువా సర్దుకుంటూ రోడ్డు ముఖం పట్టారు. రాజు ఇంట్లోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడు రామం ఆలోచిస్తున్నాడు వంద రూపాయలు కోసం. రెండు వందలు బేరాన్ని వందరూపాయలకి తెచ్చాం, మరి వంద ఎలా సంపాదించటం అని. తీరా రానే వచ్చింది మంగళవారం. రామం పిండం పిండ కార్యక్రమాన్ని పూర్తి చేసింది పాపం.

అన్ని నిజాలు, జరిగిపోయిన చరిత్రకు, జరగనున్న భవిష్యత్తుకు నేనే సాక్షి. ఈ చరిత్ర మొత్తం ఆర్థిక సంబంధాల చరిత్ర, చరిత్ర మొత్తం ప్రత్యక్ష

దోపిడీ చరిత్ర అని ఏలుగెత్తి చాటుతూ, జీవన వైరుధ్యం చాటాలనుకున్న నోరు లేక ఇంకిపోబోయి ఉంది ఆ నిర్మల నాగావళి నది. ఎందరెందరో ఏమ వంతు కర్తవ్యం మానుకున్నా, ఎగవేసినా, పలాయనం చిత్తగించినా తన వంతు కర్తవ్యం మాత్రం నిస్సంకోచంగా, నిర్భయంగా పూర్తి చేసుకుంటుంది ఆ నదీమతల్లి నాగావళి.

శాస్త్రిగారు, రామం, సరంజామా నంతటిని ఒడ్డుపై పెట్టారు. స్నానానికని నీరు ఉన్న చోటును వెదుక్కుంటూ ముందుకు వెళ్ళారు. ఇంతలో అటుగా వస్తున్నాడు నిత్య దరిద్రుడు మూడు తరాలుగా భిక్షాటనమే జీవన వృత్తిగా పెట్టుకున్న లక్ష్మీపతి. ఏరా నది ఒడ్డున ఇన్ని తినుబండారాలు చూసేసరికి వెంటనే అర్థం అయిపోయింది. గబగబ తినటం మొదలుపెట్టాడు. కొంచెం ఆకలి ఉన్నప్పుడు ఎక్కువ పనికిరాదు. ఎక్కువ ఆకలి ఉన్నప్పుడు ఎక్కువ పనికిరాదు. కొంచెం ఆకలి ఉన్నప్పుడు మరీ కొంచెం తినడం పనికిరాదు. ఈ సమస్యే ఎదురైంది లక్ష్మీపతికి కూడాను.

దూరాన్నుంచి రామం, శాస్త్రి రావటం చూసాడు. పరిస్థితి పూర్తిగా అవగతం కాసాగింది. వెంటనే కాళ్ళకు బుద్ధిచెప్పి ఒకటే పరుగు లంకించుకున్నాడు. శాస్త్రికి ఇదేం అర్థం కాలేదు.

రామం ఇంటికి వచ్చి నది ఒడ్డున జరిగిన విషయం సవిస్తరంగా వివరించాడు. రాజుకు నవ్వాగలేదు. ఈ నికృష్టపు వ్యవస్థలో పిండం దొరకటమే మార్గం. అవకాశం దొరికింది, వినియోగించుకున్నాడు. వాడి తప్పేం లేదంటూ లక్ష్మీపతి తరపున వకాల్తా పుచ్చుకున్నాడు రాజు.

సుందరమ్మగారు ఆ రాత్రంతా నిద్రపోకుండా ఏడుస్తూ కూర్చున్నారు. రాజు తన "నాస్తికత్వం - మన కర్తవ్యాలు" పుస్తకం చదవటం మొదలెట్టాడు. ఆ రాత్రి తెల్లవారిపోతుంది. తప్పనిసరి. ఎందువలనంటే భూమి గుండ్రంగా సూర్యుని చుట్టూ తిరగటం, తనలో తాను తిరగటం ఎంత సత్యమో మరీ వ్యవస్థ మారటం గూడా అంతే సత్యం. రాజులో గూడా ఆ చిగురాశ మొలకెత్తుతుంది. మరి దానికి నీరు ఎవరు పోస్తారో? వీరా? నేనా? కాదు మరి ఎవరు? ఇంకెవ్వరు ఈ సమాజము.

*

# లావాగీతం

-మట్టా కృష్ణమూర్తి

మీరు నమ్మితే నమ్మండి నమ్మకపోతే నమ్మకపోండి
నేను మాత్రం ఛస్తే నమ్మను
ఈ దేశంలో- దెయ్యాలూ, భూతాలూ, పిశాచాలు లేవంటే-
ఎక్కడ పాడైన ప్రాంతీయ గొడవలో
ఎక్కడ కుక్కగొడుగుల కుల కలహాలో
ఎక్కడ మహామారి మత మారణహోమాలో
అక్కడ- అక్కడ- అక్కడే
విశ్వహిందూ పరిషత్ దెయ్యాలూ
భారతీయ జనతాపార్టీ భూతాలూ
రాష్ట్రీయ స్వయం సేవక్ పిశాచాలూ
విశ్వ వీర విహారం చేస్తుంటే
అరివీర భయంకరంగా వీరంగమేస్తుంటే
ఏకాత్మతా సమవాకారాల్ని ప్రదర్శిస్తుంటే
వికటాట్టహాసంలో మీసాల్ని మెలేస్తుంటే
దెయ్యాలూ భూతాలూ పిశాచాలూ లేవండీ, నమ్మండీ అని
ముద్దు ముద్దుగా మొద్దు మొద్దుగా చెప్తారేంటి ?
అన్నం కోసం కన్నమేస్తే
ఎముకల్లోకి సున్నం లేకుండా ఉన్నమనే వీళ్ళు
బొక్కసాల్ని బొక్కసాల్ని తెగ బొక్కి బలిస్తే
మహారాజులనీ, మహానుభావులనీ, మహాత్ములనీ
నాలుక సాగ తెగపొగిడే వీళ్ళు
రాజభరణాలు అరణాలనీ, ఆభరణాలనీ
తెగ నీల్గుతూ నిక్కుతూ మొరిగే వీళ్ళు
రాజనాలు పండించి రాసులు పోస్తే
నోటికి కూటికి దూరం చెయ్యటానికి
పూర్వజన్మల పునర్జన్మల పూసె త్తి
కర్మల గిర్మల గందరగోళంలోకి నెట్టే వీళ్ళు
మంత్ర ప్రోక్షణంలో వాజానందాన్నిస్తామనే వీళ్ళ
ద్విజన్ములా ? ద్విజిహ్వులా ? ద్విపాదులా ?
ఒక్క క్షణం తీక్షణంగా ఆలోచించండి-
తంపుల తంత్రాల కుళ్ళుబుద్ధితో

కులాలకి కులాలకి మధ్య ఆజ్యం పోసి
మతాలకి మతాలకి మధ్య మంటల్లేపి
జనాన్ని నల్లుల్లా బల్లుల్లా మలమల మాడ్చి చంపే వీళ్లు
రాజకీయవేత్తలా? రంకుమొగుళ్ళా? రక్తపింజర్లా?
ఒక్క క్షణం నిశ్చలంగా ఆలోచించండి—
ప్రజల్ని, ప్రజాస్వామ్యాన్ని
అజ్ఞాన దుర్గంధభూయిష్టమైన చేతబడుల్లో జాడ్యమతుల్లో
యజ్ఞాల్లో యాగాల్లో బలిపశువుల్ని జేసి
స్వాముల్ని స్వాములోర్లని ఓవర్‌సీర్లుగా జేసి
లేనోడి కొంపముంచి వున్నోడి కుండ నింపి
ఆబోతుల్లా బలిసి బతికి బట్టకట్టే వీళ్ళు
యోగులా? భోగులా? వీరభోగవసంతరాయుళ్ళా?
ఒక్క క్షణం అంతరాంతరాల్లోకెళ్ళి శోధించండి-
మతం దున్నపోతుని, లేపటానికి, రేపటానికి
అటు కాశ్మీరం నుండి యిటు కన్యాకుమారి దాకా
మనకు పట్టిన దుర్గతి గుండెల మీదుగా
పురాతన జాగ్రస్త రుగ్మతల రథాన్ని
కాషాయాంబర వేషధారులై
కషాయం వినాదాల్తో నడిపించాలనే వీళ్ళు
మతోద్ధారకులా? మతోన్మాదులా? మహిషాసురులా?
ఒక్క క్షణం నిర్వికల్పంగా, నిఖార్సుగా ఆలోచించండి-
పాతకథల్లోని పీతతత్వాన్ని పాతబోసి
రంకుబొంకుల కథల్లోని విషాన్ని రంగుల గాజుల్లో రసం జేసి
మిత్తికి ముక్తికి ముచ్చటైన ముకుతాడేసి
మూఢుల్ని ముండల్నిజేసి మూల కూచోబెట్టి
మిండల మూలాన్ని విలాసాలుగా మెప్పించి
గమ్మత్తు మత్తు ముంపుల్లో మూపుల్దాకా ముంచి
మూల్లేవాళ్ళ ములుగుల్ని మూజూసి మురిసిపోయేవీళ్ళు
వెనక్కే నక్క నడిచేవాళ్ళా? వెక్కిరించి యేడ్పించేవాళ్ళా?
ఏడేళ్ల శనిగాళ్లా? వేలయేళ్ల శకునిగాళ్ళా?
ఒక్క క్షణం- మీరే! మీరే! ఆలోచించండి-
ఏనాడూ దోపిడీ దొంగల మీద ఈగల్నివాలకుండా
తప్పుల్ని ఒప్పులుగా, ఒప్పుల్ని తప్పులుగా జేసి
పదవుల పెదవులకై నోరూరి పొంగ కార్చుకొంటున్న

కుటిల కుతంత్ర కూనారి కుమారుల్లారా!
స్వార్థం హోమంలో ధూమంలో
వేపుళ్లయి, నంజుళ్లయి మసైపోతున్న
మహామహా ఘన నాయకమ్మన్యుల్లారా!
పసచెడి పనికిమాలి పనికిరాని
కిచిడీ పార్టీల్లోని కీచకుల్లారా!
పాచిపన్ను పాకీపన్ను మాని, కళ్ళు తెరిచి, ఒళ్ళు వొంచి
మీ పంచల్లోని వంచనా కాంచనాన్ని పారవేయండి!
పారా పలుగుల్తో పుడమిలో పోరాడి పోరాడి
జాతి బతుకుని పండించే ఓ రైతుల్లారా!
రక్తరేకులు రక్తాన్ని పిండుతాయే గాని
రక్షణియ్యవని యికనైనా తెల్సుకొని తెమలండి–
యంత్రాల్తో కుస్తీపట్టి కోటానుకోట్ల సరుకుల్ని సృష్టించి
దేశాన్ని వసంత సంతగా జేసే ఓ శ్రామికుల్లారా!
కమ్మని కనికట్టుల్తో కడుపులు తీరవనీ
మంత్రాల్తో చింతకాయలు రాలవనీ
ఈ మంతనాల మంత్రాంగంతో మనోవ్యథపోదనీ
కలిమి బలిమి కోసం కండబలం గుండెబలం కళ్లు తెరువూ–
రేల తిక్కని తన్ని పారేయటానికి
కలం కాయితాల కవిలె గల ఓ మేధావుల్లారా!
కులం నీతిలో కుళ్ళిపోక
మతం మాయలో మన్నుగాక
గతం గోతిలో పూడిపోక
అసురుసురైన అసంఖ్యాక అశేష జనానీకానికి
సజీవ చైతన్యామృతాన్ని పంచటానికి
మీ శక్తి యుక్తుల్ని భక్తితో
శ్రామిక జనశక్తులకి నైవేద్యం చేయటానికి
సాంస్కృతిక సేనానులుగా ఆ గతానికి స్వాగతం చెప్పండి!
యాత్రామాత్రల్తో దేశం దేహాన్ని పగల చీల్చటానికి
జనారణ్యంలో లేచిన చీకటి ఓచ్చుల కచ్చల
చిచ్చుబుడ్లను చావగొట్టి చెవులు మూయటానికి
హేతువాద దురంధరులారా! నాస్తికోద్యమకారులారా,
ప్రజాస్వామ్య వ్యక్తులారా వామపక్ష శక్తులారా!
మానవత్వం మహోన్నతమైనదని జూలు దులిపి లేవండి:

గుండెల కొండల్లో నవ చైతన్యం లావాలై పొంగండి।
ఎర్రెర్రని వెలుగులై వెలిగి వెలుగుబాటలేయండి।
యుగయుగాల పనోవికాసశక్తిని నిర్నిరోధంగా నిలపండి।
మానవ మనోజ్ఞ విజ్ఞాన మనోరథాన్ని ముమ్ముందుకే నడపండి। ।*।

---

# ఉద్యమ వార్తలు

## మెదక్ జిల్లా

మెదక్‌జిల్లాలో భారతనాస్తిక సమాజం రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో "బాణా మతి పరిశీలన కమిటీ" ఒకటి నవంబరు 5వ తేదీనుంచి 13వ తేదీవరకు పర్యటిం. చింది. ఈ కమిటీ, రాష్ట్ర కమిటీ ప్రధానకార్యదర్శి రామకృష్ణగారి నాయకత్వంలో పర్యటించింది.

కమిటీలో—1. రామకృష్ణ (రాష్ట్ర ప్రధానకార్యదర్శి) 2. డా. [illegible]. వి రమణ, 3. డా. యం. వి. సుబ్బారావు, 4. ప్రొ. విక్రమ్ (హిప్నటిస్టు) 5. ప్రొ. యస్. డి. సూర్యారావు (మెజిషియన్) 6. ఏద్వర్డుమాన్యుర్ (ప్యారా సైకాలజీ) 7. భార్గవమూర్తి (ఫోటోగ్రాఫర్) 8. జె. వెంకటేశ్వరరావు (కమిటీ సభ్యులు) 9. పి. సోమప్ప (మెదక్‌జిల్లా కమిటీ అధ్యక్షులు) 10. బాలిరెడ్డి (భా.నా.స. మెదక్‌జిల్లా ట్రజరరీ) 11. నాగభూషణం (మెదక్‌జిల్లా ప్రధానకార్య దర్శి( 12. సత్యనారాయణ (మెదక్‌జిల్లా కమిటీ సభ్యులు) ఉన్నారు.

సంగారెడ్డి-సదాశివపేట-జహీరాబాదు-అందోళ్-నర్సపూర్-మెదక్ — గజ్వేల్ తాలూకాల్లో చాలా గ్రామాలు తిరిగి బాణామతి గూర్చి ప్రచారం చేసింది. ఎంతో మందిని చైతన్యవంతుల్ని చేసింది.

12, 13 తేదీల్లో అందోళ్‌లో మెదక్‌జిల్లా భారత నాస్తిక సమాజం-జిల్లా మహాసభలు జరిగాయి. రెండవరోజున నూతన కార్యవర్గం ఎన్నుకోబడింది.

| | | | |
|---|---|---|---|
| 1. | సోమప్ప | — | అధ్యక్షులు |
| 2. | నాగభూషణం | — | ప్రధానకార్యదర్శి |
| 3. | డి. సంగమేశ్వర్ | — | ఉపాధ్యక్షులు |
| 4. | ఎ. రాంకిషన్ | — | సహాయ కార్యదర్శి |
| 5. | ఎ. విజయకుమార్ | — | ఆర్గనైజింగ్ సెక్రటరీ |
| 6. | ఎ. బాలిరెడ్డి | — | కోశాధికారి |

కార్యవర్గ సభ్యులు :— 1. కె. రఘునందన్ 2. కోటయ్య 3. ఇంద్ర సేనారెడ్డి 4. సుధాకర్ 5. వైద్యనాథ్ 6. డి. పోచయ్య 7. కె. పోచయ్య 8. జ. ప్రభు 9. యం. రవి 10. యస్. పురుషోత్తం 11. వినోద్‌సింగు.

జిల్లా మహాసభలకు ఎనిమిది తాలూకాలనుంచి ప్రతినిధులు హాజరయ్యారు.

## ప్రకాశం జిల్లా ;

27—1-1983న ప్రకాశం జిల్లా మార్టూరులో "గిట్టుబాటు ధరల" గురించి బహిరంగ సభ జరిగింది.

ఈ సభకు రాష్ట్రకమిటీ ప్రధాన కార్యదర్శి రామకృష్ణగారు అధ్యక్షత వహించారు.

ఉపన్యాసకులుగా గుంటూరుజిల్లా భా.నా.స. అధ్యక్షులు మట్టా కృష్ణమూర్తి గారు, రాష్ట్ర ఆర్గనైజింగు సెక్రటరీ రంగారావుగారు, గుంటూరుజిల్లా ప్రజాసంఘటన నాయకులు యం. పాపిరెడ్డిగారు పాల్గొన్నారు. గుత్తా సింగారావుగారు గేయాలాపన గావించారు.

తరువాత 28, 29 తేదీలలో మార్టూరునుంచి ఒంగోలు వరకు భారతనాస్తిక సమాజం-ప్రకాశం జిల్లా శాఖవారి ఆధ్వర్యంలో "రైతులకు గిట్టుబాటు ధర" అనే అంశంపై పాదయాత్ర నిర్వహించబడింది. 29 సాయంకాలం ఒంగోలు జిల్లా కలెక్టరు కార్యాలయానికి పాదయాత్ర దళం చేరి "మెమోరాండం"ను సమర్పించిరి.

ప్రకాశం జిల్లా అద్దంకి తాలూకా "కోనంకి" గ్రామంలో భారతనాస్తికసమాజం - గ్రామ కమిటీ నిర్మాణం జరిగింది.

అధ్యక్షులు : మంధపాటి చినమస్తాను.
ప్రధాన కార్యదర్శి : కొర్రపాటి ఆంజనేయులు.
సంయుక్త కార్యదర్శి : స్వర్ణ రాజేంద్రప్రసాద్.
కోశాధికారి : ఉప్పలపాటి సత్యనారాయణ.

కార్యవర్గ సభ్యులు : 1. ఉప్పలపాటి చక్రపాణి, 2. కొర్రపాటి సాంబశివరావు, 3. వీరవల్లి సాంబశివరావు, 4. జమ్ముల వెంకటేశ్వరరావు, 5. జాగర్లమూడి సుబ్బారావు, 6. ఉప్పలపాటి వెంకటేశ్వర్లు B.P.M., 7. కొర్రపాటి వెంకటేశ్వరరావు, 8. ఉప్పలపాటి వెంకటేశ్వరరావు, 9. దూళిపాళ్ళ కోటేశ్వరరావు 10. కొల్లూరి అంకమ్మ.

## గుంటూరు జిల్లా ;

గుంటూరు జిల్లా నాగార్జున విశ్వవిద్యాలయంలోని హాస్టళ్ళ దినోత్సవంలో కత్తి పద్మారావుగారు ఉపన్యసించారు. కులాలకు, మతాలకు అతీతంగవున్న నాగార్జునుడి పేర వెలసిన విశ్వవిద్యాలయంలో కులం స్వైర విహారం చేయటం సిగ్గు చేటని విశ్వవిద్యాలయాల్లో కులం పాత్ర గురించి వివరించారు.

## కృష్ణ జిల్లా ;

నాస్తికకేంద్రం : నవంబరు 15వ తేదీన గోరా 81వ జయంతి ఉత్సవం జరిగింది. పగలు వివిధ విషయాలపై చర్చలు - గోష్టులు నిర్వహించారు.

"సెక్యులరిజం_సమాజ పరివర్తన" అనే గోష్టిని_ ఆల్ ఇండియా-రేడియో స్టేషన్ డైరక్టరు పి. ఆర్. రెడ్డిగారు ప్రారంభించారు.

"చట్టము - సమాజ పరివర్తన" అనే విషయంపై న్యాయవాది టి. వి. పురుషోత్తమరావు ప్రసంగించారు.

కేరళ రేషనలిస్టు నాయకులు, కేరళ అధికార భాషాసంఘ మాజీ అధ్యక్షులు యం. ప్రభుగారు సెక్యులరిజం గురించి మాట్లాడారు. పరకాల పట్టాభిరామారావుగారు మత మౌఢ్య ప్రమాదాన్ని హెచ్చరిస్తూ ఉపన్యసించారు. డా. విజయం గూడా ఈ గోష్టిలో పాల్గొన్నారు.

ఆ రోజు సాయంకాలం జరిగిన గోరా జయంతి సభకు ఏటుకూరి బలరామ మూర్తిగారు అధ్యక్షత వహించారు. గోరా విశిష్ట వ్యక్తిత్వాన్ని వీరు వివరించారు. ఈ సభలో యం. సుబ్రమణ్యరాజు, మహబూబ్ ఆదంగార్లు ఉపన్యసించారు.

అనంతరం వ్యాసరచన పోటీలో గెలుపొందిన విద్యార్థినీ, విద్యార్థులకు యం. ప్రభుగారు బహుమతులందజేశారు.

మైత్రి గారి వందన సమర్పణతో సభ ముగిసింది.

# "వారసత్వ అర్చక విధానం రద్దుకావాలి"

భారత నాస్తిక సమాజం రాష్ట్రశాఖ అధ్యక్షులు శ్రీ శ్రీరామమూర్తి గారు 26-9-83వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి ఒక లేఖవ్రాశారు. అందులో వారసత్వ అర్చక విధానం రద్దు విషయమై వ్రాసిన ఆ లేఖ యొక్క పూర్తి పాఠం ఇలా వుంది.

"ప్రియమైన ముఖ్యమంత్రిగారూ: వారసత్వ- అర్చకత్వ విధానమును రద్దు చేయాలని, అన్ని కులాల వారికి హిందూ దేవాలయ అర్చనార్హతను కలిగించాలని మీరు యోచించిన నిర్ణయమునుగూర్చి భారతనాస్తిక సమాజం (ఆం.ప్ర.) సభ్యులతరపున నా సంతోషాన్ని తెలియజేస్తున్నాను. త్వరలో మీ నిర్ణయం శాసనం ద్వారా వాస్తవ రూపం ధరించాలని ఆశిస్తున్నాను. గత 300 ఏళ్ళనుండి ఈ వారసత్వ అర్చకత్వం అనేది సాంఘిక అనైక్యతకు, దోపిడికి సాధనంగాను ఉపయోగపడుతూ వస్తున్నది. ఈ విధానం బ్రాహ్మణులలోని ఒక వర్గానికి ఎవరూ ప్రశ్నింపరాని ప్రత్యేకమైన హక్కుగా, వివిధ కులాల ప్రజలకున్న హక్కులన్నింటి కంటే విలువైన హక్కుగా మారింది. దేవాలయ రాబడులను, నిధులను సక్రమంగా వినియోగపర్చాలనుకొనే ప్రజాస్వామ్యవాదులకు వాటిననుభవిస్తూ సుఖిస్తున్న వారసత్వ అర్చక విధానంనుండి మూర్ఖ వ్యతిరేకత ఎదురౌతున్నది.

కాబట్టి వారసత్వపు అర్చక విధానాన్ని రద్దుచేసే అత్యవసమైన రాష్ట్ర ప్రభుత్వ శాసనమే కాకుండా ఈ విషయమై భారత రాజ్యాంగం లోని కొన్ని ఆర్టికల్స్‌ను సవరించాల్సిన అవసరం కూడా కన్పిస్తున్నది.

మీరు నిర్ణయించిన "వారసత్వపు అర్చక విధానపు రద్దు" విషయం మీ ప్రభుత్వం ద్వారానే త్వరలోనే శాసనం రాగలదని ఆశిస్తున్నాను".

# లేఖలు

ప్రియమైన ఎడిటర్ గారికి

నవంబరు సంచికలో చక్కనైన సంపాదకీయంతో వాస్తవాల్ని చూపిస్తూ రాశారు. "సాంస్కృతిక పోరాటం సాగాలి" అన్న నినాదంగా ప్రతిధ్వనిస్తుంది.

"నేనెలా నాస్తికుణ్ణయ్యాను" అనే శీర్షిక, మంచి హృదయాల అనుభవాలను తెలియజేస్తూ, మానవత్వాన్ని గుర్తింపచేస్తూ, నిజాన్ని చూపిస్తూ పాఠకుల్ని వాస్తవ లోకానికి తీసుకెళ్తున్నాయి.

చక్కటి రీతిలో పత్రికని నడిపిస్తున్న మీకు హృదయ పూర్వక నమస్సులు చెప్పలేక ఉండలేను.

మీ
సుద్దాల సుధాకర్
భువనగిరి

గేయం :

## నాస్తికత్వమంటే

మహోదయ

నాస్తికత్వమంటే
నిత్య చైతన్యం
నూతన వికాసం
శాస్త్రీయ దృక్పథం
రాజకీయ పరిజ్ఞానం ॥
నాస్తికత్వమంటే
మూఢవిశ్వాసాలను
దురాచారాలను
విష సంస్కృతిని
ఖండించే ఆయుధం ॥
నాస్తికత్వమంటే
భ్రాంతిపై క్రాంతిని
జగతిపై శాంతిని
సమసమాజాన్ని
నిర్మాణం చేయటం ॥

* * *

## ఓ మంచివార్త

సంప్రదాయానికి భిన్నంగా **చార్వాక కేలండర్** అచ్చులో వుంది.

ప్రాచీన భారత విప్లవకారులైన- అసీతకేశ కంబళ- సంజయిబేలట్టి పుత్ర- పూర్ణ కాశ్యపుడు- కపిలుడు- కణాదుడు మొదలైన వారి చిత్రాలతో వెలువడుతుంది. మీ కాపీలకు వెంటనే రాయండి.

కాపీ ఒక్కొటి 1-50 మేనేజరు

"నాస్తిక యుగం"

NASTHIKA YUGAM : Registered at Registerar of News Papers, New Delli.

# "హిందూ ఏకాత్మతా యజ్ఞం" గుట్టురట్టు చేయండి

హిందూ సామ్రాజ్యవాదాన్ని తిప్పికొట్టండి

హిందూ సంప్రదాయం అనైక్యతకు ఆలవాలం

ఏకాత్మతా యజ్ఞం ఏకత్వానికి కాదు

కులం, అంటరానితనాన్ని నూరిపోసిన

హిందూధర్మం ఏకత్వానికి ప్రబల శత్రువు

మతం మానవుల పాలిటి మత్తుమందు

సంప్రదాయం మనిషిని జంతువుగా మారుస్తుంది

ఏకాత్మతా రథాల ప్రయాణం రాతియుగానికా ?

రాకెట్టు యుగానికా ?

అణుయుగంలో మధ్య, ఆటవికయుగాలభావాలా!

ఛీ- ఛీ- ఛీ-



Editor: Dr. Jayagopal (Vizag), Publishers: Ramakrishna (Mag)
Printers: Vijaya Press, Mangalagiri. Phone : 82-413



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102M284 |
| పుస్తకం పేరు | తొలకరి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Priyank |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |